13.10.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:39 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు
జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

# పెళ్ళకూరు ఇక లేరు!



పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారు స్వర్గస్తు లైనారు. నిన్నటి వరకు నవ్వుతూ, నవ్విస్తూ, ఉత్సాహంతో త్రుళ్లి పడుతూ తిరిగిన ఆ నిత్య సంతోషి నిర్జీవులై పోయారు. 12 తేది రాత్రి 12 గంటల సమయంలో ఆయన ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోయాయి.

మనసును కలిచి వేసే, శోకంతో గుండెను నింపే విషాద పరిణామమిది. నాలుగు రోజుల క్రితం వరకు రామచంద్రా రెడ్డి గారు సంపూర్ణ ఆరోగ్యంతో, నిత్య యవ్వనుడి వలె చలాకీగా తిరుగు తుండినారు. గత వారంలోనే ప్యారిస్ పర్యటన నుంచి తిరిగి వచ్చిన ఆయన ఒక అనుచరుడి ఇంట వివాహంలో పాల్గొన డానికి ఢిల్లీ నుంచి నెల్లూరు వచ్చారు. పెళ్లిలో అందరితో నవ్వుతూ మాట్లాడారు. 8 తేది ఉదయం పినాకిని ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు బయల్దేరారు. అదే ఆఖరి పలకరింపు అవుతుందని ఎవ్వరూ వూహించలేదు. రైలెక్కే సమయంలోనే

**నవ్వుతూనే మృత్యువును ఆహ్వానించిన ధన్యజీవి!**

కొద్దిగా ఇబ్బందిగా వుందన్నారట. మద్రాసులో రైలు దిగిన తర్వాత కూడా అనీజీగా కన్పించారట. అయితే తనను ఆవహించ బోతున్న మృత్యు దేవత సామీప్యాన్ని ఆయన ఏ మాత్రం పసిగట్ట లేకపోయారు. స్టేషన్ నుంచి నేరుగా ఢిల్లీ వెళ్లడానికి విమానా శ్రయానికి బయల్దేరారు. కాని ఇఫ్కో అధికారి ఒకరు జోక్యం చేసుకొని చెకప్ పేరుతో అపోలో ఆస్పత్రికి తీసుకెళ్లారట. అక్కడ డాక్టర్లు ఇసిజి తీస్తుండగానే హృదయ చలనం ఆగిపోయింది. ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా తిరిగి కోలుకోలేదు. విషయం తెలిసిన వెంటనే, క్షణాలలో ప్రధాన మంత్రి శ్రీ పివి నరసింహ రావు డాక్టర్లతో స్వయంగా మాట్లాడి, ఆధునిక వైద్య వసతులన్నీ కల్పించినా ఫలితం కన్పించలేదు. అప్పటికి ఓపన్ హార్ట్ సర్జరీ కూడా చేశారు. కానీ వృధా ప్రయాసైంది. రెండు రోజులు కోమాలో వుండి, 12 తేది రాత్రి కన్ను మూశారు. హృదయ చలనం ఆగే వరకు చలాకీగా, నవ్వు

కొరవ 7 పేజీలో

దగ్గుపాటి నిష్క్రమణతో ఎమ్మెల్యేల పంట పండింది!

# కోర్కెలు తీర్చడానికి మామా, అల్లుళ్ళ పోటాపోటీ!

చంద్రబాబు ప్రభుత్వం ఉంటుందా? ఊడుతుందా? తెల్లారితే ఏం జరుగు తుంది? ఎంత మంది ఎమ్మెల్యేలు ఎన్టీఆర్ శిబిరంలోకి ఫిరాయించారు? చంద్రబాబు స్కోరెంత? రామారావు స్కోరెంత? ఇదీ నేటి అధికార రాజకీయ ముఖ చిత్రం.

రెండు శిబిరాలుగా చీలిన ఎన్టీఆర్ కుటుంబ రాజకీయాల స్వార్థానికి రాష్ట్ర ప్రభుత్వ మనుగడ ప్రశ్నార్థకంగా మారింది. 222 మంది తెలుగు తమ్ముళ్లను గెలిపించి సుస్థిరంగా పరిపాలన చేయమని అన్నకు అధికారం అప్పగిస్తే, వదినమ్మ ఎక్స్‌ట్రా పాత్రను అడ్డం పెట్టి చంద్రబాబు అమాంతంగా ముఖ్యమంత్రి కుర్చీనే కబళించాడు. చంద్రబాబు తాను పన్నిన పార్వతి వ్యూహంలో పెద్దల్లుడు దగ్గుబాటి వెంకటేశ్వర రావును పావుగా ఉపయోగించి ఎన్టీఆర్ ఆట కట్టించాడు. పాపం దగ్గుబాటి, చంద్ర జాలాన్ని అర్థం చేసుకోలేక బురదలో కాలేశాడు. భీష్మ పితామహుడ్ని హతం చేయటానికి అర్జునుడు శిఖండి సాయం తీసుకున్నట్లు ఎన్టీఆర్ పీఠానికి ఎసరు పెట్టడానికి దగ్గుబాటిని శిఖండిగా అడ్డంపెట్టి తాను అధికార పీఠాన్ని అందుకున్నారు. తెలుగుదేశంలో ఉప్పు - నిప్పులా వుండే తోడల్లుళ్లిద్దరూ ఒకటైనప్పుడే ఈ అపవిత్ర కలయిక ఎన్నాళ్లని అందరూ చెవులు కొరుక్కున్నారు. చంద్రబాబు మంత్రి వర్గం ఏర్పాటులో ఉప

**ఎన్టీఆర్ వద్దకు వెళ్తే అసెంబ్లీ రద్దవుతుందని బాబు వూదర!**

ముఖ్యమంత్రి దక్కని దగ్గుబాటి ఆ రోజు నుంచే రుసరుస లాడటం మొదలెట్టాడు. ఆ తర్వాత పార్టీ అధ్యక్ష పదవిని కూడా చంద్రబాబే ఉంచు కోవటం దగ్గుబాటిని తీవ్ర మనస్తాపానికి గురిచేసింది. కనీసం మంత్రి వర్గ విస్తరణలో అయినా ఉప ముఖ్యమంత్రి పదవి ఇవ్వక పోతాడా అని దింపుడు కళ్లెం ఆశతో ఎదురు చూసిన దగ్గుబాటికి నిరాశే మిగిలింది. ఏ పదవీ లేకుండా చంద్రబాబు శిబిరంలో అనామకుడిగా మిగిలే కంటె మామ పక్షాన చేరి కనీసం ఉనికిని కాపాడు కుందామనుకొని దగ్గుబాటి అమాంతంగా ఎన్టీఆర్ శిబిరంలో చేరిపోయాడు. నిజానికి దగ్గుబాటి ఇలా చేస్తాడని ముందుగా ఊహించిందే. ముఖ్యమంత్రి పదవి వచ్చాక దగ్గుబాటి పీడ వదిలించు కోవాలన్నది చంద్రబాబు వ్యూహం. ఒక పథకం ప్రకారం దగ్గుబాటికి ప్రాధాన్యత ఇవ్వకుండా పొగబెట్టాడు. అసలే సున్నిత మనస్కుడు, మొహమాటి అయిన దగ్గుబాటి ఇక లాభం లేదనుకొని మామగారి చూరు కిందకు చేరి పోయాడు. తాను ఒక్కడే కాకుండా మరో 14 మంది ఎమ్మెల్యే తమ్ముళ్లను కూడా వెంట బెట్టుకెళ్లాడు. దగ్గుబాటిని తిరిగి ఎన్టీఆర్ శిబిరంలోకి చేర్చడానికి ఎన్టీఆర్ పెద్ద కుమారుడు జయకృష్ణ రాయబారం నడిపాడు. నిజానికి ఎవరి రాయబారం లేక పోయినప్పటికీ గత్యంతరం లేని దగ్గుబాటి ఎన్టీఆర్ పక్షంలో చేరి పోయేవాడే. ఎన్టీఆర్ శిబిరంలో స్కోరు 40కి చేరింది. మరో వారం రోజుల్లో ఈ స్కోరు 70 కు చేరుతుందని ఎన్టీఆర్ వర్గీయులు ప్రచారం చేస్తున్నారు. కాగా ఎమ్మెల్యేలు జారి పోకుండా చంద్రబాబు కూడా గట్టి వ్యూహాన్ని పన్నుతున్నారు. ఇటీవలి విస్తరణలో చోటు దొరక్క డీలా పడిన ఎమ్మెల్యేల్ని ప్రత్యేకంగా పిలిపించుకొని వారికి వేరే తాయిలం పెడ్తానని చెబుతున్నారు. జిల్లాల వారీగా ఎమ్మెల్యేల్ని సంతృప్తి పరిచే బాధ్యతను సంబంధిత జిల్లా మంత్రులకు అప్పజెప్పారు. ఎమ్మెల్యేలు నోరు తెరిచి ఫలానా పని కావాలంటే ఆఘ మేఘాల మీద సదరు పని జరిగి పోతోంది. కాగా చంద్రబాబు శిబిరంలో చోటు చేసుకున్న అసంతృప్తిని తమకు అనుకూలంగా మలుచుకునే ప్రయత్నంలో ఎన్టీఆర్ వర్గీయులు యమ బిజీగా వున్నారు. ఎవరైనా ఎమ్మెల్యే అసంతృప్తికి లోనయ్యాడన్న వార్త పొక్కితే చాలు ఉభయ వర్గాలు ఆ ఎమ్మెల్యేకు గాలం వేస్తున్నాయి. ఎన్టీఆర్ వర్గీయుల ప్రచారం ప్రకారం వచ్చే నెల 17వ తేదిన తిరిగి ఎన్టీఆర్ ముఖ్యమంత్రి అవుతారట. అయితే ఇంత తొందరలో బాబు ప్రభుత్వం కూలి పోతుందనటానికి గట్టి దాఖలాలేమీ కనిపించటం లేదు. గతంలో నాదెండ్ల భాస్కర రావు ఉదంతంలో తిరిగి వచ్చిన తమ్ముళ్లకు తిరిగి పార్టీ టిక్కెట్లు ఇస్తానని నమ్మించి గొంతు కోసిన ఎన్టీఆర్ చండ శాసనత్వాన్ని ఇంకా తెలుగు తమ్ముళ్లు మరచి పోలేక పోతున్నారు. ఇప్పుడు కూడా ఎన్టీఆర్ పాత పాటే పాడుతున్నారు. కాబట్టి ఇంత తొందరలో ఎగబడి ఆయన దగ్గరకు పోవాల్సిన అవసరం, ఆగత్యం అంతగా కనిపించడం లేదు. ఒకవేళ అందరూ తిరిగి వెళ్లి మళ్లీ ఎన్టీఆర్‌ను ముఖ్యమంత్రిని చేస్తే అసెంబ్లీని రద్దు చేస్తాడని చంద్రబాబు వర్గీయులు ఊదర గొట్టేస్తున్నారు. మంత్రి పదవులు ఆశించి భంగ పడ్డవాళ్లు మినహా మిగతా ఎమ్మెల్యేలు చంద్రబాబు పట్ల అంతగా అసంతృప్తిని వ్యక్తం చేయక పోవడం గమనార్హం.

**ఎన్నికల్లోగా తన దగ్గరకు వస్తే టిక్కెట్లు ఖాయమని ఎన్టీఆర్ హామీ**

ఇలా వుండగా చంద్రబాబును టిడిఎల్‌పి నాయకుడిగా గుర్తించటం పై స్పీకర్ చర్యను సవాలు చేస్తూ ఎన్టీఆర్ కోర్టు కెక్కిన సంగతి తెల్సిందే. ఈ కేసును ఆయనే స్వయంగా కోర్టులో వాదిస్తారట. గతంలో సినిమాల్లో లాయర్ విశ్వనాథ్ గా పాత్రలు వేసిన స్ఫూర్తి ఇందుకు కారణం కావచ్చు. రాజకీయంగా కాకపోతే న్యాయపరంగా అయినా తన హక్కును సాధించి తీరుతానని ఎన్టీఆర్ అంటున్నాడు. అయితే ఎమ్మెల్యేల మద్దతు లేకుండా తిరిగి ఎలా తాను ముఖ్యమంత్రి అవుతాడో ఆయనకే తెలియాలి.

డాక్టర్ దగ్గుబాటి ప్రవేశంతో ఎన్టీఆర్ ఇల్లు తిరిగి కళకళ లాడుతోంది. ఎన్టీఆర్ కూడా ఇప్పుడు రాజకీయ చర్చల్లో మునిగి తేలుతున్నాడు. వచ్చే పార్లమెంటు ఎన్నికల్లో రాష్ట్రంలో అత్యధిక స్థానాలు సంపాదించి చంద్రబాబు ప్రభుత్వం రద్దును కోరాలన్నది ఎన్టీఆర్ వ్యూహం. ఇదే జరిగితే బాబు ప్రభుత్వం కూలి పోతుందన్న భయంతోనైనా ఎమ్మెల్యేలు తిరిగి తన అండన చేరక పోతారా? తాను తిరిగి ముఖ్యమంత్రిని

కొరవ 11 పేజీలో




# మాట రామోజీదైతే చేత చంద్రబాబుది!

ఈనాడు పత్రికాధిపతి రామోజీ రావు ప్రోద్బలంతోనే బాబు తన గొంతు కోశాడని దగ్గుబాటి వెంకటేశ్వర రావు ధుమ ధుమ లాడుతున్నాడు. చంద్ర బాబు పేరుకు ముఖ్యమంత్రే కానీ వెనక ఆడించేదంతా రామోజీ రావేనని దగ్గుబాటి ప్రచారం చేస్తున్నాడు. దగ్గుబాటి ఆరోపణలో నిజం లేక పోలేదు. ఈరోజు ఈనాడులో సంపాద కీయం వస్తే దాని పై తెల్లారే ముఖ్య మంత్రి నిర్ణయం తీసుకోవడం జరుగు తోంది. మాట రామోజీది అయితే చేత చంద్రబాబుది. బాబు ప్రభుత్వంలో రామోజీ పాత్ర పై ఎమ్మెల్యేల్లో గుసగుసలు మొదలయ్యాయి. బయట పడి రామోజీ రావుతో తకరారు పెట్టు కోవడానికి మాత్రం ఎమ్మెల్యేలు సిద్ధంగా లేరు.

**దగ్గుపాటి ధుమధుమ**

### ప్రభుత్వం వుందా? లేదా?

నెల రోజుల్లోనే చంద్రబాబు ప్రభుత్వం పస తేలిపోయింది. ముఖ్యమంత్రి అయ్యాక రాజకీయంగా ఇల్లు చక్క దిద్దు కోవటంతోనే బాబు పని అయిపోతున్నది. ప్రభుత్వ పరంగా సరికొత్త విధాన నిర్ణయం అంటూ ఏదీ చేయలేక పోతున్నాడు. పాత ప్రభుత్వాల్లో ప్రవేశ పెట్టిన పథకాలనే వల్లె వేస్తూ రోజుకో సమీక్షా సమావేశం ఏర్పాటు చేసి కాలక్షేపం చేయడం మినహా కొత్త ప్రభుత్వం ఏర్పాటైందన్న ఇంపాక్ట్ తేలేక పోతున్నారు. ఎన్టీఆర్ మంత్రి వర్గంలో నెంబర్ టుగా రాణించిన బాబు నెంబర్ వన్‌గా తన ప్రభావాన్ని చూపించలేక పోవడానికి కారణం దిన దిన గండంగా మారిన ఎమ్మెల్యేల వలస వల్ల ఏర్పడుతున్న రాజకీయ అస్థిరత నవచ్చు.

# స్వంత మనుషులకు ఓపలేనంత నిరాశ

నెల రోజుల తర్వాత చంద్రబాబు తన మంత్రి వర్గాన్ని విస్తరించి కొత్తగా మరో 16 మందికి మంత్రి పదవి భిక్ష వేశారు. అయితే చంద్రబాబును ముఖ్య మంత్రిగా చేయడానికి అహర్నిశం కృషి చేసిన సొంత మనుషులకు మాత్రం పదవులు దక్కక పోవటమే ఆశ్చర్యం కలిగించింది.

**మళ్లీ విస్తరణ మభ్యపెట్టే మాట!**

కాళహస్తి ఎమ్మెల్యే గోపాలకృష్ణారెడ్డి, నిజామాబాద్ జిల్లా డిచ్‌పల్లి ఎమ్మెల్యే మండవ వెంకటేశ్వర రావు, మెదక్ జిల్లా ఎమ్మెల్యే చంద్రశేఖర్, కరీంనగర్ జిల్లా ఎమ్మెల్యే రాంచందర్ రావు, చీఫ్ విప్ ఎర్రం నాయుడు, స్పీకర్ యనమల రామకృష్ణుడు ఇటీవలి చంద్రబాబో పాఖ్యానంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. అయినా విస్తరణలో వీరికి నిరాశే మిగిలింది. కాగా డిప్యూటీ ఆశించి భంగపడి ఇప్పుడు ఎన్టీఆర్ పంచలో చేరారు. సొంత మనుషులు కాబట్టి వారిని ఎలాగైనా ఊరడించు కోవచ్చని బాబు భావించి ఉండవచ్చు కానీ ఎమ్మెల్యేలలో చాలా మందికి ఈ నిర్ణయం ఆగ్రహం తెప్పించింది. చివరి నిముషంలో ఫిరాయించి బాబు వర్గంలో చేరిన బాబూఖాన్‌కు మంత్రి పదవి రావడం బాబు వర్గీయు లెవరికీ ఇష్టం లేదు. మొత్తం 27 మంది సభ్యులున్న తన మంత్రి వర్గాన్ని మరో మారు విస్తరిస్తానని చంద్రబాబు చెప్పడం ఎమ్మెల్యేలను మభ్య పెట్టడాని కేనన్నది తెలిసిందే. అయితే లోక్‌సభ ఎన్నికలకు ముందు చిన్నపాటి విస్తరణవుండే అవకాశం లేకపోలేదు. ఏది ఏమైనా ఊహించినట్లే బాబు విస్తరణ ఎమ్మెల్యేలలో తీవ్ర అసంతృప్తికి గురి చేసింది. ఫలితంగా 14 మంది ఎమ్మెల్యేలు ఎన్టీఆర్ శిబిరంలోకి వెళ్లారు. ఇక ముందు ఎంత మంది వెళ్తారన్నది బాబు వ్యవహార శైలి పై ఆధారపడి వుంటుంది.



# గోడమీద పిల్లులు

రాష్ట్ర రాజకీయాలలో గోడ మీద పిల్లుల ఆట మరొక సారి మొదలైంది; రాష్ట్ర పరిపాలన ఎన్టీఆర్ కుటుంబ సభ్యుల మధ్య తోలు బొమ్మలాట చందంగా తయారైంది. డాక్టర్ దగ్గుపాటి వెంకటేశ్వర రావు 14 మంది శాసన సభ్యులను వెంట బెట్టుకొని మామ గారి పంచన చేరిపోయారు. ఇదేమీ వూహించని పరిణామం కాదు. మంత్రి వర్గ విస్తరణలో తనకు స్థానం లభించలేదని తెలియగానే ఆయన బోర్డు త్రిప్పడం ఖాయమని అందరూ అను కుంటుండిన సంగతే! అసలాయన చంద్రబాబుతో కలిసి ఎన్టీఆర్‌ను ధిక్కరించి తిరుగుబాటులో పాలు పంచుకోవడమే ఆశ్చర్య పడవలసిన విషయం. తోడళ్లు లిద్దరికీ ఎప్పుడూ సయోధ్య లేదు. ఆగస్టు తిరుగుబాటు సమయంలోనూ చంద్రబాబు పై ప్రేమతో ఆయన రాలేదు; లక్ష్మీపార్వతి పట్ల ఎమ్మెల్యేలలో పెల్లుబికిన నిరసన చూసి ఆ ప్రవాహంలో తరలి వచ్చేసిన వాడు వెంకటేశ్వర రావు. అయితే తన పెద్దరికాన్ని గౌరవించి తనకు ఉప ముఖ్యమంత్రిత్వం ఇస్తారని వెంకటేశ్వర రావు భావించాడు. కాని చంద్రబాబు ఆ పొరపాటు చేయలేదు. తన తోడల్లుడికి పదవి ఇస్తే సమాంతర అధికార కేంద్రం తయారౌ తుందని. అది ఎప్పటికైనా తనకు చికాకు కల్గిస్తుందని భావించి తెలివిగా ప్రక్కకు తప్పించేశాడు. వెంకటేశ్వర రావుకు ఇక తానిక్కడ వుండడం వ్యర్థమని అర్థమై పోయింది. ఇంకొక వైపు ఎన్టీఆర్ జనాకర్షణ శక్తి పెరిగి పోతూ వుంది. రానున్న పార్లమెంట్ ఎన్నికలలో ఎన్టీఆర్ సమ్మోహ నాస్త్రాన్ని. సానుభూతి పవనాల్ని తట్టుకొని ఓట్లు రాబట్టు కోగల విద్య చంద్రబాబుకు లేదు గాక లేదు. అధికారమూ అందక, ఎన్నికల్లో ఓట్లూ తెచ్చుకోలేక ఉభయ భ్రష్టుత్వం పట్టే కంటె తప్పయి పోయింది మామా అని చెంపలేసు కోవడమే వుత్తమమని వెంకటేశ్వర రావు భావించారు. రామారావు గారు కూడా పండక్కి అల్లుడ్ని పిల్చిన తరహాలో వెంకటేశ్వర రావు దగ్గరకు జయకృష్ణను పంపి, ఆహ్వాన మందజేసి, అల్లుడి బెట్టు తగ్గకుండా వుండడానికి తన అహం చంపుకొని మరీ పార్టీలోకి రప్పించాడు. వెంకటేశ్వర రావు తోటి వెళ్లిన 14 మంది ఎమ్మెల్యేలు ఆయన అనుచరులు కారు. ఆయన వలెనే మంత్రి పదవు లాశించి వెళ్లి, అవి దక్కక పోయే సరికి తిరిగి వచ్చేసిన వారు. పరిటాల రవి, ప్రతిభా భారతి, కరణం రామచంద్ర రావు వగైరాలు వెంకటేశ్వ రావు అనుచరులా? ఇది వరకట్లా లక్ష్మీపార్వతి భజన బృందంగా పేరు పడిన వారే కదా వీరు?

మామ దగ్గర పదవులు రానప్పుడు అల్లుడి దగ్గరకు, అల్లుడి దగ్గర పదవులు పొందలేకుంటే మామ దగ్గరకు వెళ్తూ, వస్తూ రాజకీయాన్ని పరమ నీచపు దశకు దిగజార్చే స్తున్నారు తెలుగు ఎమ్మెల్యేలు. లక్ష్మీపార్వతి మితిమీరిన జోక్యం సహించ లేమనే నినాదంతో నలభై రోజుల క్రితం తిరుగుబాటు ప్రకటించిన వారు, ఈలోగా ఏమి మార్పు వచ్చిందని తిరిగి ఎన్టీఆర్ దగ్గరకు వెళ్లినట్లు? నిన్నటి వరకు విద్రోహులు, వెన్నుపోటు దారులు, ఘాతుకులు అని తాను తిట్టి పోసిన వారిని ఈ రోజు తిరిగి చేరదీయ డానికి ఎన్టీఆర్ వారిలో ఏమి మార్పు చూసినట్లు? అధికారం యావలో ఉచ్చ నీచాలు మర్చిపోయి వ్యవహరించ డానికి ఇద్దరూ సిగ్గు పడక పోవడం తెలుగు ప్రజలు చేసుకున్న దౌర్భాగ్యమని సరి పెట్టు కోవలసిందే!

జమీన్‌రైతు

వెంకటేశ్వర రావు నిష్క్రమణ వల్ల ఇప్పటి కిప్పుడు చంద్రబాబు ప్రభుత్వానికి వచ్చిన ఢోకా ఏమీ లేదు. రెండింట మూడు వంతుల మెజారిటీకి సరిపడా ఇంకా ఎమ్మెల్యేలు మిగిలే వున్నారు. మరి కొందరు జారుకున్నా సిపిఎం, సిపిఐల మద్దతుతోనైనా చంద్రబాబు తాత్కాలికంగా బండి లాగించేయ గలడు. అయితే ఈ గోడ మీద పిల్లులాట జరిగినంత కాలం రాష్ట్ర ప్రభుత్వం రాజకీయ అస్థిరత్వానికి గురికాక తప్పదు. నిత్యం ఎమ్మెల్యేల బెదరింపులు, ఫిరాయిపు భయంతో దినదిన గండం నూరేళ్లా యుష్షుగా బ్రతుకు నెట్టాల్సిందే ముఖ్యమంత్రి. మామా అల్లుళ్ల మధ్య నడిచే ఈ తోలు బొమ్మలాటలో నష్టపోయేది రాష్ట్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రజలు!

---

జమీన్‌రైతు

12.10.1945

వెల: 0-1-6 పేజీలు:8

## పల్లెటూళ్లు

### రేబాల

చచ్చిన గొడ్లకు గూడా వెంకట గిరి యిస్టేటులో పుర్వరి వసూలు చేస్తు న్నారు! చచ్చినా జమీందారీ పీడ తొల గదా? మా చచ్చిన గొడ్ల చర్మం రాజ గారి జనమే తీసు కుంటున్నారు. మా గొడ్ల చర్మం మాదా? రాజా గారిదా?

### కావలి

సా. మాలె కొండారెడ్డి గారి అధ్యక్షతన హై స్కూలు సారస్వత సంఘ వార్షి కోత్సవము. విద్యార్థులకు వివిధ బహుమతుల ప్రధానం 4 తేది జరిగింది. కావలి జిల్లా మున్సబు రంగా రామ్ గారు "హబిస్ - స్పోర్ట్సు" అను విషయమై చక్కగా వుపన్యసించారు.

### గూడూరు

బట్టల అంగళ్లకు తెల్ల కోరా వచ్చింది. వచ్చిన వెంటనే వర్తకులు కొంత మంది అమ్మి వేశారు. కాని గోరి సుబ్బరామయ్య అనే వర్తకుడు మాత్రం వచ్చిన గుడ్డను చీరలుగా చించి దాచిపెట్టి అమ్మివేసి నానని చెప్పినాడని కొందరు సబ్ కలెక్టర్ గారికి చెప్పిరి తక్షణమే కలెక్టర్ వారు కారులో వచ్చి తనిఖీ చేసి సుబ్బరామయ్య దగ్గర వున్న నాలుగు చీరలను పట్టుకొని అచ్చట వున్న వారికి అమ్మించి ఆ వర్తకుని పై కేసు పెట్టించారు.

### దామరమడుగు

పలగాని బలరామి రెడ్డి గారి యింటి తొలకారు కోడిపెట్ట ఒకరోజు 5 గుడ్లు, ఒకరోజు 6 గుడ్లు, ఒకరోజు 3 గుడ్లు వరుసగా పెట్టింది.

## నెల్లూరుముచ్చట్లు

### 15 వేలు వసూలు

మైలై సంగీత సభ బిల్డింగ్ ఫండు సహాయార్థం 15.11.45 తేది మద్రాసులో గానకోకిల యం.ఎస్. సుబ్బలక్ష్మి పాటకచ్చేరి. టిక్కటు 1 కి 500 రూపాయలు.

మద్రాసు టెక్స్టైయిల్ కమీషనరు జిల్లా లన్నిటి మీద తన క్రింది వుద్యోగుల ద్వారా వసూలు జేస్తున్నారు.

అబ్బా!! ఆ జిల్లాలో 15 వేల రూపాయల దాకా వసూలు చేశారట.

ఒక్క సూళ్లూరు పేట నాయుడు పేటలలో మాత్రమే 4,500 రూపాయలు వసూలు జేశారు. అంటే 9 టిక్కెట్లమ్మ కమన్నమాట. టెక్

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

స్టైయిలాఫీ సరంతటి వాడడిగితే వారి చేతి క్రింద వుండే గుడ్డల నూలు వర్తకులు కాదని చెప్పగలరా? టెక్స్టయిల్ కమీషనరు వుత్తరువును టెక్స్టయిలు ఆఫీసర్లు కాదనే గుండెదిట వుందా?

ఈ జిల్లాకు సంబంధించని ఒక బిల్డింగ్ ఫండుకు, అందులో తెలుగు త్యాగరాజ కీర్తనలు పాడగూడదని చెప్పే సంగీత సభకు తెనుగు దేశం పేరుతో అందులో నెల్లూరు జిల్లా భాగానికి 15 వేల రూపాయలు వసూలా?

కొరవ 12 పేజీలో

---

# పద్మశ్రీగారి కోటి రూపాయలేమైనాయి?

పార్లమెంటు సభ్యుల కోటా క్రింద కేంద్ర ప్రభుత్వం విడుదల చేస్తున్న కోటి రూపాయల నిధులను ఎమ్పీ తన ఇష్టాను సారం తన నియోజక వర్గంలో ప్రజాహిత కార్యక్రమాలకు ఖర్చు పెట్టవచ్చు. నెల్లూరు ఎమ్పీ పద్మశ్రీ గారు ఈ కోటి రూపాయల నిధులను తన నియోజక వర్గంలో ఎక్కడ ఏ పనులకు కేటాయించారో ఒక్కసారి పత్రికా ప్రకటన కూడా చేయలేదు. ఆ ప్రకటన చేస్తే రేపటి ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులకు ఇది ఎంతగానో మేలు చేస్తుంది. ఎమ్పీ గారు తన కోటాలోని నిధులన్నీ ఒకే చోట ఖర్చు పెట్టే బదులు, జిల్లాలోని 11 నియోజక వరాల్లోని ముఖ్య సమస్యలు గుర్తించి 10 లక్షలు లెక్కన కేటాయిస్తే పద్మశ్రీ మేలును ప్రజలు పది కాలాల పాటు గుర్తు పెట్టు కొంటారు.

నెల్లూరు -జె.పోలిరెడ్డి

## కొత్త మంత్రులు సాఫల్యత పొందాలి

నెల్లూరు జిల్లాకు చంద్రబాబు నాయకత్వంలో రెండు మంత్రి పదవులు దక్కాయి. ఎందువల్లో సర్వేపల్లి చంద్రమోహనుని నిరాశ పరిచారు. నెల్లూరు రమేష రెడ్డిని మార్కెటింగ్ మంత్రిని చేయడం నెల్లూరీయు లందరికీ సంతోషం. పాత కూర గాయల మార్కెట్ ప్రాంతం నిరంతరం గబ్బు కొడ్తున్నది. మార్కెట్‌ను ఇక్కడ నుండి మద్రాసు బస్టాండ్‌కు తరలించడమే దీనికి పరిష్కారం. అక్కడున్న కోనేరులో మంత్రి కోల్డు స్టోరేజి ప్లాంటు ఏర్పాటు చేయాలి. తన శాఖ పరిధిలోని ఈ పనిని రమేష్ రెడ్డి చేయిస్తే పదవి సార్థక మవుతుంది. డ్రైనేజి సమస్య వల్ల చిన్న బజారులో చినుకు పడితే అడుగు తీసి అడుగు వేయలేని దుస్థితి. మంత్రిగా రమేష్ రెడ్డి రాష్ట్ర ప్రభుత్వం నుంచి తగినన్ని నిధులు తెచ్చి టౌన్‌లోని వివిధ సమస్యలతో పాటు మినీ బైపాస్ రోడ్డు నిర్మాణం త్వరగా పూర్తి చేయించాలి.

## జనవాణి

సెకండరీ విద్యా శాఖ పొందిన దుర్గా ప్రసాద్‌కు జిల్లాలోని పలు పాఠశాలలు పూరి పాకల్లో నడుస్తున్న సంగతి తెలుసు. వాటిని సరిదిద్ది పాఠాలు చెప్పను వుపాధ్యాయులు. లేని చోట, ఆ సమస్య తీర్చి జిల్లా ప్రజల మన్ననలు పొందాలి. మంత్రుల ద్వయం జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి హరికృష్ణ సహకారంతో జిల్లాను అభివృద్ధి మార్గంలో పయనింప జేయాలి.

నెల్లూరు -వాస్తు రామచంద్ర

## ధరలు తగ్గడంలో మతలబేమైనా వుందా?

నిత్యావసర వస్తువులను ప్రభుత్వం వారు నిర్ణయించిన తక్కువ రేట్లకు అమ్మమని వ్యాపారస్తులను ఆదేశించడం వారు ఒప్పుకోవడం జరిగింది. ఈ వ్యవహారం పై పలు సందేహాలు కలుగుతున్నాయి. రేట్లు తగ్గించి అమ్మడం ఎట్లా సాధ్య పడుతుంది? ఇంతకు ముందు వ్యాపారస్తులు అమ్ముతున్న రేట్లకు ప్రస్తుతం రేట్లకు ఇప్పుడు తేడా

కొరవ 8 పేజీలో

# రహదారి మృత్యు బిలాలకు ఇంకెన్ని లారీలు బలికావాలి?

## నెల్లూరు సంగతులు

ట్రాఫిక్ నియంత్రణ కోసం నెల్లూరు టౌన్‌లో పోలీసులు ఏర్పాటు చేసిన డివైడర్లు డెత్ ట్రాప్‌లుగా మారి పోతున్నాయి. వారి ఉద్దేశ్యం మంచిదే. ఎదురెదురుగా వాహనాలు నడిస్తే ట్రాఫిక్ ముందుకు జరగదు. ఎవడిష్టం వచ్చినట్లు వాడు దూరి దూరి ట్రాఫిక్ జామ్‌లు సృష్టిస్తారు; ప్రమాదాలు కల్పిస్తారు. డివైడర్లు వుండి ఏ వాహనాలు ఆ వైపు వెళ్లడం చాలా అవసరం. అయితే డివైడర్లు పెట్టడానికి కొన్ని నియమా లున్నాయి. రోడ్డు పరిస్థితి, వాహనాలు నడిపే వారి ఇబ్బందులు దృష్టిలో పెట్టుకొని వాటిని ఏర్పాటు చేయాలి. నెల్లూరులో అటువంటిది జరగడం లేదు. రోడ్డుకు సగానికి గీత గీసి, ఇనుప ఫ్రేములు బిగించేస్తున్నారు. అవి ఎక్కడ మొదలౌతాయో, ఎక్కడ అంత మౌతాయో తెలియదు. దూరం నుంచి వచ్చే వాహనాలకు డివైడర్లున్న సంగతి తెలియడం లేదు. తెలుసుకొని తప్పించేలోగా వాటిని గుద్దేస్తున్నారు. పెద్దాసుపత్రి ఎదురుగా, కోర్టు సమీపంలో ఆర్టీసి బస్టాండు దగ్గర ఇప్పటి కిటు వంటి ప్రమాదాలెన్నో జరిగాయి. లారీలు కొట్టి తమ ఫ్రేములు దెబ్బ తింటున్నాయని, వంద టన్నుల బరువుతో పెద్ద పెద్ద కాంక్రీట్ దిమ్మలు డివైడర్లకు ముందు పెడుతున్నారు. ఫలితంగా లారీలు వాటికి గుద్దుకొని తుక్కు తుక్కై పోతున్నాయి. ప్రక్క ఫోటో చూడండి. ఆర్ అండ్ బి గెస్ట్ హౌస్ దగ్గర డివైడరు రక్షణ కోసం కట్టిన కాంక్రీట్ దిమ్మను ఢీకొని ఆ లారీ ఏ గతి పట్టిందో చూడండి. దాన్ని మళ్లీ దారికి తేవాలంటే ఆ యజమానికెన్ని లక్షలు కావాలి? ఎవరు భరిస్తారీ నష్టం? ఆ అదుటుకు ఆ లారీ డ్రైవర్ ప్రాణం పోలేదంటే అదృష్టమే కదా?

డివైడర్లు వున్న విషయం సూచిస్తూ, తగు ఎత్తులో రేడియం బిళ్లలతో బోర్డు బిగిస్తే ఈ ప్రమాదాలు జరగవు. డివైడర్లకు ముందుగా, వాటి మీదుగా వీధి దీపాలు వేయడమూ పద్ధతి. రోడ్డు మలుపుల్లో సూచనలు లేకుండా రోడ్డును విభజించడం మృత్యు బిలాన్ని సృష్టించడమే. అధికారులు తమ తప్పు గ్రహించి, మునిసి పాలిటీ సహకారంతో శాస్త్రీయంగా డివైడర్లను ఆధుని కరించాలి. లేకుంటే అవి ఎందరిని బలి తీసుకొంటాయో వూహించడం కష్టం.

### పార్లమెంటు ఎన్నికల్లో కాంగ్రెస్ మెరుగౌతుంది

లోక్‌సభ ఎన్నికలు సమీపిస్తున్న కొలది దేశంలో కాంగ్రెస్ పార్టీకి అనుకూల వాతావరణం ఏర్పడు తున్నట్లు రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, మాజీ ముఖ్య మంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి చెప్పారు. 8 తేది పార్టీ కార్యకర్తల కష్ట సుఖాలను తెలుసు కొనేందుకు నెల్లూరు వచ్చిన జనార్దన రెడ్డి పొదలకూరు రోడ్డులోని స్వగృహంలో విలేకరులతో మాట్లాడారు. ఆంధ్ర ప్రదేశ్‌లో ఇటీవలి రాజకీయ పరిణామాలతో నేషనల్ ఫ్రంట్‌కు తలాతోక లేకుండా పోయిందని; లెఫ్ట్ ఫ్రెంట్ పరిస్థితి అగమ్య గోచరంగా తయారయ్యిందని అన్నారు. క్రమశిక్షణ గల పార్టీ అనే సొంత డబ్బా కొట్టుకొనే బిజెపి ఆ అసలు స్వరూపం గుజరాత్ పరిణామాలలో ప్రజలకు కళ్లకు కట్టినట్లు తెలిసిందన్నారు. ఇటువంటి పరిస్థితులలో ఇప్పటికే ఎన్నో సార్లు సుస్థిర పాలన అందించిన కాంగ్రెస్ వైపే పార్లమెంటు ఎన్నికల్లో ప్రజలు మొగ్గు చూపుతారన్న ధీమా వ్యక్తం చేశారాయన. రాష్ట్రంలో మామ మారాక వచ్చిన అల్లుడి పాలనలో మార్పులేవీ కనపడడం లేదన్నారు. గతంలో రాష్ట్రంలో ఎన్నడూ

కొరవ 11 పేజీలో



# మూడు వస్తువుల ధర తగ్గించి ముప్పయ్ ధరలు పెంచారు!

వ్యాపారస్తులు, టక్కు టమార గజ, గోకర్ణ విద్యలలో ఆరితేరిన వారు. వీరికి ముక్కు తాడు వేయడం అంత సులువు కాదు. నిత్యావసర వస్తువులైన కందిపప్పు, పెసరపప్పు, మినపప్పు, వేరుశనగ నూనెల విషయంలో ప్రభుత్వం ప్రకటించిన రేట్లకు తాము సుముఖ మేనంటూ పత్రికా ప్రకటనలు, జిల్లా కలెక్టర్ ముందు బాసలు చేసారు. కాని టౌన్‌లో దాన్ని నిలబెట్టు కొన్న పాపాన పోవడం లేదు. ప్రకటనలన్నీ నిజమని నమ్మి ప్రొవిజన్స్ స్టోర్స్‌కు సరకు కోసం వెళ్లిన వారికి కొన్ని చోట్ల నో స్టాకు బోర్డులు, మరి కొన్ని చోట్ల మానవ మాత్రులు తినలేని పుచ్చు రకం సరకులను ప్రభుత్వమే సరఫరా చేస్తుందని చెప్పి ఇస్తూ వచ్చి మోసం చేస్తున్నారు. నామ మాత్రంగా నాలుగు వస్తువుల పై రేట్లు తగ్గించినట్లు నటన చేస్తూ, మిగతా వస్తువుల పై గత నెలలో కన్నా ఈ నెలలో రేట్లు అధికంగా దట్టించి అమ్ముతూ రెండు విధాలుగా వ్యాపారస్తులు లాభాలార్జి స్తున్నారు.

ప్రభుత్వం నిత్యావసర వస్తువుల చట్టాన్ని సడలించడంతో వ్యాపారస్తులు ఇంత వరకు మార్కెట్‌లో అమ్ముకోలేని పుచ్చు, నాసి రకం సరకు దర్జాగా అమ్ముకొనే అవకాశం కల్గింది తప్ప, దీని

> **ముఖ్యమంత్రి ఇచ్చిన అలుసుతో నెల్లూరు వ్యాపారులు మునుపెన్నడూలేని దగా చేస్తున్నారు; దోచుకుంటున్నారు**

వల్ల ప్రజలకు ఏ మాత్రం ఉపయోగ పడడం లేదనడంలో పోయిందనడంలో ఏ మాత్రం సందేహం లేదు. సెప్టెంబర్ మొదటి వారంలో కందిపప్పు కేజీ 32 రూపాయ లుండేది. అది ప్రస్తుతం 22 రూపాయలకు చేరినా పరమ నాసిరకమే ఆ ధరకు లభిస్తున్నది. పెసరపప్పు గత నెలలో కూడా కేజి 22 రూపాయలు. మార్కెట్‌లో స్వేచ్ఛగా లభించేది. కాని ప్రభుత్వం అదే రేటుకు అమ్మమని చెప్పడంతో టౌన్‌లోని చాలా షాపుల్లో పెసరపప్పుకు అకస్మాత్తుగా కొరత ఏర్పడి, పెద్ద పెద్ద షాపుల్లో నో స్టాకు బోర్డులు కనపడు తున్నాయి. మినపప్పు గత మాసంలో 30 రూపాయ లుండగా, ప్రస్తుతం 18 రూపాయలకు మార్కెట్‌లో దొరుకు తున్నా నల్లని పొట్టుతో నాసిరకంగా వుంది. దాన్ని ప్రభుత్వమే పంపించినట్లు వ్యాపారస్తులు నమ్మ బలుకు తున్నారు. వేరు శెనగ నూనె కేవలం 4 రూపాయలు తగ్గినా కల్తీ ఎక్కువైంది. పై నాలుగు వస్తువులకు ప్రభుత్వం ధరలు నియంత్రించింది. మిగతా వాటి గూర్చి ప్రస్తావించక పోయేసరికి గత నెలలో 28 రూపాయ లుండిన చింతపండు ఈ నెలలో 30 రూపాయలయ్యింది. పచ్చి శెనగ పప్పు 13 రూపాయల నుండి 16, వేరు

కొరవ 10 పేజీలో

# రమేష్‌రెడ్డి వూరేగింపుకు వూరంతా ధగధగలు!

## చిన్న మంత్రిత్వానికి పెద్ద ఆర్భాటం

రాష్ట్ర మార్కెటింగ్ శాఖ సహాయ మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన తరువాత తన స్వంత నియోజక వర్గానికి విచ్చేసిన నెల్లూరు ఎమ్మెల్యే రమేష్ రెడ్డిని పార్టీ కార్యకర్తలు, అభిమానులు అపూర్వంగా స్వాగతించారు. రైల్వేస్టేషన్ మొదలుకొని ఊరేగింపు పూర్తయ్యే వరకు అడుగడుగునా సామాన్య ప్రజలు ఆప్యాయంగా వ్యాన్ ఆపి తమ అభిమానాన్ని పూలదండల రూపంలో ప్రదర్శించారు. ఊరేగింపు నడిచిన దారంతా రోడ్లకు ఇరువైపులా మిరుమిట్లు గొలిపే రంగు రంగుల విద్యుత్ దీపాల ప్రత్యేకంగా అలంకరించారు. ట్రంకురోడ్డులో సీరియల్ సెట్లతో చిక్కని పందిళ్లు వేసారు. చంద్రబాబు, హరికృష్ణ వ్రాసిన బ్యానర్లతో రోడ్లు మొత్తం నింపేశారు. చిన్న బజారులో ఇళ్లను కూడా విద్యుత్ దీపాలతో కళ్లకింపుగా అలంకరించారు. అక్కడక్కడా మిద్దెల పై నుంచి అభిమానులు కురిపించిన పూల వర్షానికి రమేష్ రెడ్డి ఉబ్బి తబ్బిబ్బై పోయారు. స్వాగత సత్కారాలు ఏర్పాటు చేసిన తెలుగు దేశం స్థానిక నాయకులు ధర్మవరపు సుబ్బారావు, దువ్వూరు శరత్ చంద్ర అంగళ్లకు వెళ్లి, తన కృతజ్ఞత తెల్పుకున్నాడు రమేష్ రెడ్డి.

గంగు గంటలు ఆలస్యంగా వచ్చిన పినాకిని ఎక్స్‌ప్రెస్ నుండి దిగిన మంత్రి రమేష్ రెడ్డికి తొలి మాల వేయను ఆయన అభిమానులు ఎగబడడంతో త్రొక్కిసలాట జరిగింది. పోలీసులు సరిదిద్దే లోపు ఆహ్వాన కమిటీ అధ్యక్షుడు వై.వి. రామిరెడ్డి గజ మాల వేసి మంత్రిని ఆలింగనం చేసుకొని స్వాగతించారు. మునిసిపల్ వైస్ ఛైర్మన్ దశరథ రామయ్య, అరిగెల కోదండ రామయ్య ప్లాట్‌ఫారం పైనే మంత్రిని మాలలతో ముంచెత్తారు. స్టేషన్ బయటకు వచ్చేసరికి కార్యకర్తలు, పోలీసుల మధ్య మంత్రి నలిగి పోయారు. తానే స్వయంగా ఏర్పాటు చేసిన టాటా ట్రక్కును తేగా నారసింహా రెడ్డి ముచ్చటగా అలంకరింప జేసి, తాను ముందెక్కి రమేష్ రెడ్డి కనీసం ఎదురు చూస్తుండినారు. ఆయనతో పాటు ఉదయగిరి ఎమ్మెల్యే కంభం విజయరామి రెడ్డి, రాపూరు ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు వేనాటి మునిరెడ్డి, వంటేరు వేణుగోపాల రెడ్డి మంత్రికి స్వాగతం పలికి ట్రక్కు ఎక్కించారు. కలువాయి తప్పెట్లు, పులి వేషాలు, కీలు గుర్రాలు, విజయ వాడ బేతాళ జట్టు చిత్ర విచిత్ర విన్యాసాలు చెవుల తుప్పు వదలించే టపాసుల శబ్దాల మధ్య ఊరేగింపు బయలు దేరింది. సుబేదారు పేట, సంతపేట, చిన్నబజారు, పెద్ద బజారు, నెహ్రూ బొమ్మ, వి.ఆర్.సి. గాంధీ బొమ్మల మీదుగా నర్తకి సెంటర్ చేరేసరికి రాత్రి 11 గంట లయ్యింది. మంద హాసం, ముకుళిత హస్తాలతో వ్యాను పై నిలబడ్డ మంత్రికి మాలలు

వేయాలని పలువురు తహతహ లాడినా వ్యాన పై ఎక్కి వేసే వసతి లేక నిరాశ పడ్డారు.

# దొంగ నోట్లు కావాలంటే రాపూరు వెళ్లండి!

రాపూరులో గతంలో 20 రూపాయల దొంగ నోట్లు అనేకం చలామణి అయ్యి సంచలనం సృష్టించాయి. పోలీసులు దీని మీద పెద్ద శ్రద్ధ కనపర్చక పోయేసరికి మళ్లీ మార్కెట్‌లోకి 50 రూపాయల దొంగ నోట్లు ప్రవేశించి యథేచ్ఛగా చలామణి అయిపోతున్నాయి. దొంగ నోట్లని తెలుసు కోలేక వీటిని తీసుకొన్న వ్యాపారస్తులు ప్రస్తుతం నాలుక కరచుకొని ఈ విషయం ఎవరికీ చెప్పక, తేలు కుట్టిన దొంగల్లా వుంటున్నారు. ఈ నోట్ల కోసమ పట్టుకొని విదదీస్తే బొమ్మా బొరుసులు వేరవు తున్నాయి. కాసేపు నీళ్లలో నాన్చితే ఈ దొంగ నోట్ల గుట్టు రట్టవుతున్నది. రాపూరు పోలీసులు ఈ విషయంలో లోతుగా దర్యాప్తు జరిపితే వాస్తవాలు వెల్లడవుతాయి.

## వంటేరు- రాజకీయాల్లో పసి పిల్లవాడు: కలికి

కావలి తెలుగు దేశం నాయకుడు వంటేరు వేణుగోపాల రెడ్డి తనను విమర్శించడం పట్ల ఎమ్మెల్యే కలికి యానాది రెడ్డి స్పందించి విలేకరుల సమావేశం ఏర్పాటు చేశారు. జిల్లా నుండి రాష్ట్ర కార్యవర్గానికి ఎన్నికైన వేణుగోపాల రెడ్డిని రాజకీయ పరిజ్ఞానం లేని పసి బాలునితో పోల్చి విమర్శించారాయన. నేను కావలి నియోజక వర్గానికి ఏమి చేయలేదని; జనాకర్షణ లేని నాయకుడనని వేణు గోపాల రెడ్డి అంటున్నాడు. తెలుగు దేశం పార్టీ ప్రభంజనంలో కూడా ప్రజలు నన్ను గెలిపించడమే నాకున్న జనాకర్షణ అని వంటేరు గమనించాలని కలికి చెప్పారు. సోమశిల ప్రాజెక్టును 1974 సంవత్సరంలో అప్పటి ముఖ్యమంత్రి వెంగళ రావు చేత శంకుస్థాపన చేయించాను; కావలి రైల్వే బ్రిడ్జిని నాలుగు సంవత్సరాలు కష్టపడి సాధిస్తే,

కొరవ 7 పేజీలో

### పోలీసులూ, పారా హుషార్!

# దసరా మామూలివ్వలేదని ఫోన్‌లైన్లు పీకి పారేశారు!

రాపూరులో గత నెల రోజులుగా టెలిఫోన్లు పనిచేయక వినియోగ దార్లు పడరాని పాట్లు పడుతున్నారు. పేరుకు రాపూరుకు ఎస్టీడి సౌకర్యం వున్నా, వినియోగ దారులకు దాన్ని ఉపయోగించుకొనే అవకాశమే రావడం లేదు. ఇక్కడి టెలిఫోన్ వినియోగ దారులకు పొదలకూరు ఎక్ఛేంజ్ జంక్షన్. దసరా మామూళ్లు ఇవ్వలేదని అక్కడి సిబ్బంది ఎస్టీడి లైన్లు రాపూరు వాసులకు దొరక కుండా చేస్తున్నారు. అడిగినంత మామూలు ఇవ్వలేదని పబ్లిక్ టెలిఫోన్ల బూతుల పై కూడా పొదలకూరు సిబ్బంది అలగడంతో రెండు వారాలుగా అవి కూడా మూత బడి వున్నాయి. ఎస్టీడి విషయమై కొందరు వినియోగదార్లు పొదలకూరు టెలికం శాఖాధి కారులను నిలదీసే సరికి, తమకు సంబంధం లేదని గూడూరు ఎక్ఛేంజ్‌లో విచారించమని [illegible] గూడూరు సిబ్బంది మాత్రం తమకు పొదలకూరు ఎక్ఛేంజ్ వారు రాపూరు లైన్లను అప్పగించలేదు మొర్రో అంటున్నారట. ఇటు పొదలకూరు, అటు గూడూరు ఎక్ఛేంజ్‌ల అధికార పరిధుల మధ్య రాపూరు ఫోనులు నలిగి పోతున్నాయి. జిల్లా టెలికం వున్నతాధి కారులు ఈ విషయమై చొరవ తీసుకొంటే మంచిది.

### జిల్లావార్తలు

## జిల్లాలో పోలియో నిరోధక టీకాల ఉద్యమం!

జిల్లాలో పోలియో ఇమ్యునైజేషన్ కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా చేపట్టి, ఈ భయంకర వ్యాధి వల్ల చిన్నారులను అవిటి వాళ్లు కాకుండా కాపాడలని జిల్లా ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ పిలుపు నిచ్చారు. 9 తేది గూడూరు సబ్ కలెక్టర్ కార్యాలయంలో ఏర్పాటు చేసిన డాక్టర్లు, ఎమ్మార్వోలు, ఎమ్డీఓలు, ఎం.ఇ.ఓ.ల సమావేశంలో ఆయన మాట్లాడారు. జిల్లాలోని పిల్లలకు మొదటి డోస్ పోలియో చుక్కలు డిసంబరు 9 తేది, రెండవ దఫా 96 జనవరి 20 తేది వేయడానికి కార్యక్రమం రూపొం దించినట్లు చెప్పారు. గతంలో మూడు డోస్‌ల పోలియో వాక్సిన్ వేయించుకొన్న పిల్లలకు కూడా ఈ పోలియో చుక్కలు వేస్తారట. డిశంబరు 95 నాటికి 3 సంవత్సరాల 11 నెలల 29 రోజుల లోపు పిల్లలందరికీ చుక్కలు వేయించ డానికి తల్లి తండ్రులు ముందుకు రావాలన్నారు. ఒక్క పిల్లవాడు ఈ

కొరవ 8 పేజీలో

# సణుగుడు

## * అధికారంతో అహం కాదు అణకువ పెరగాలి!

మంత్రిగా తన తొలి జిల్లాపర్యటనలోనే తప్పటడుగులు వేస్తున్నాడు రమేష్ రెడ్డి. అవి తప్పటడుగు లైతే కొత్త కాబట్టి సర్దుకోవచ్చు; కాని అవి తప్పటడుగు లైనప్పుడు తెలియక వేసినా, తెలిసి వేసినా జనం సహించరు; నిలదీస్తారు!

మంత్రి కావడం రమేష్ రెడ్డి పూర్వజన్మ సుకృతం; అదృష్ట మహిమ. కాలం కలిసి వచ్చి కాళ్లకు చుట్టుకున్న ఆ భాగ్యాన్ని సద్వినియోగం చేసుకో గల్గితేనే అది నాలుగు కాలాలు నిలుస్తుంది! అహం పెరగడానికి అవకాశమిస్తే ఆ తర్వాత నాలుక కరుచుకున్నా వుపయోగం వుండదు.

మంత్రి కాగానే రమేష్ రెడ్డి పత్రికలలో ఒక ప్రకటన చేశారు - మంత్రిత్వం తనకెప్పుడో రావలసింది - ఆలస్య మైందని! దీని అర్థం? అర్హత కంటే అదృష్టం ఆలస్యంగా కలిసి వచ్చిందనా లేక తన స్థాయికి తగిన గుర్తింపు తనకింత వరకు రాలేదనా? ఇటువంటి మాటలు వినేవారికి వెగటుగా వుంటాయి. రమేష్ రెడ్డి ఎమ్మెల్యే అయ్యి పది నెలలు కాలేదు; ఎమ్మెల్యేగా గెలవడం ఇదే ప్రథమం. మునిసిపల్ ఛేర్మన్‌గా నెల్లూరు టౌన్‌కు పరిమితం తప్ప, హైదరాబాదు రాజకీయానికి వెళ్లింది ఇప్పుడే! ఈలోగా పదవి రావడానికి ఆలస్య మేమిటి? ఆశకు, అర్హతకు తేడా వుంటుంది!

మంత్రిగా తొలి నెల్లూరు పర్యటనకు చేసిన దడబడలూ అభ్యంతర కరంగా వున్నాయి. టౌనంతా అలంకరించారు; లక్షలు ఖర్చు పెట్టి బెట్లు పేల్చారు; పూలు చల్లారు. ఎక్కడిదీ డబ్బన్న ప్రశ్న జనంలో వెంటనే వచ్చేస్తుంది కదా? తన పేరు చెప్పుకొని పూరు పేరు లేని వారు అంగళ్ల వద్దకు, అధికారుల వద్దకు వెళ్లి దండి చేసిన సంబరం తాత్కాలికంగా తబ్బిబ్బు కల్గించ వచ్చు కాని, తద్వారా వచ్చే చెడ్డ పేరు చాలా కాలం నిలుస్తుంది! ఆలోచించ నవసరం లేదా? అసలు వీధుల్లో చందాలు దండి సంబ రాలెందుకు చేయాలి? అభిమానం ప్రదర్శించు కోవడానికి అనుచరులకు వేరే మార్గాలు లేవా?

[illegible] కౌంట్ [illegible] విషయం కాబట్టి [illegible] గడలను చూడడం తప్పు అడగడానికి అధికారులకు [illegible] వుండదు. కాని జనం సంగతి అది కాదే? వారు ప్రశ్న మాట్లాడు కొంటారు; దాన్ని ఆపే వారెవరు! ఆపకుంటే జరిగే అనర్థం వూహించ లేనిదా?

పత్రికలలో ప్రకటనల ద్వారా, వూరేగింపులో పాల్గొనడం ద్వారా మంత్రితో తమ సాన్నిహిత్యం ప్రదర్శించుకున్న అనుచరుల నేపథ్యం ఏమిటి? సారాయంగళ్లు నడిపే వారిని, దొంగ సారా కేసులో బెయిల్ పై తిరిగే వారిని దగరకు రానివ్వ వచ్చునా? ఎంత అప్రతిష్ట?

రమేష్ రెడ్డికి ఇతర ఏ రాజకీయ వాదికీ అంత సులువుగా పట్టని అదృష్టం పట్టింది. రాజకీయంగా తెర మరుగై పోతాడనుకున్న, వెనక్కు వెళ్లి పోయాడనుకున్న పరిస్థితుల నుంచి ప్రాభవంలోకి వచ్చిన మహర్దాతకు దన్నించుకున్నాడు. ఇటువంటి దశలో అధికారం లభిస్తే అణకువ పెరగాలి; మరింత వినయం సంతరించు కోవాలి; మంచి తనం ద్వారా, మంచి పనుల ద్వారా తనను, తన పదవిని ప్రజలు అభిమానిం చేందుకు కృషి చేయాలి? ఆడంబరాలు, అట్టహాసాలు, అహంకారం మనిషిని వ్యక్తిత్వ పరంగా కుంచి వేస్తాయి; అది గ్రహించడం - ఉజ్వల రాజకీయ భవిష్యత్‌కు చాలా అవసరం.

మంత్రి పదవి చాలా గొప్ప దనుకొనే రోజులు పోయాయి. దానికా స్థాయి, దంతస్తు, హుందా తనం, గౌరవం ఎప్పుడో అంతరించాయి.

కొరవ 7 పేజీలో

### డోలేంద్ర

# నెల్లూరు నలుచ్చెరగుల్లో
## విహర్యకుడు

### పెళ్లకూరు అంత్యక్రియలు

ఇఫ్కో ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి అంత్య క్రియలు రేపు (14 తేది) సాయంత్రం జరుగుతాయి. అపోలో ఆస్పత్రి నుంచి ఈరోజు (13 తేది) ఉదయం 11 గంటలకు నెల్లూరు తీసుక వచ్చారు. పప్పుల వీధిలోని ఆయన స్వంత కళ్యాణ మండపంలో దర్శనానికి వుంచారు. పెద్ద సంఖ్యలో అభిమానులు తరలి వస్తున్నారు. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి, పివి కుమారుడు రాజేశ్వర రావు, మంత్రి శ్రీ టి. రమేష్ రెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి తదితరులు భౌతిక కాయం పై పుష్ప గుచ్ఛాలుంచారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి తిరుపతి మీదుగా మధ్యాహ్నానికి నెల్లూరు చేరుకొంటారు. ప్రధాన మంత్రి శ్రీ పివి నరసింహ రావు గారు గత మూడు రోజుల నుంచి ఫ్లూ జ్వరంతో బాధ పడుతున్నారట.

### భూమి విక్రయం ప్రకటన

ఈ క్రింది షెడ్యూల్డ్ దాఖలా భూమి నా క్లయింట్ కలికి రామ సుబ్బమ్మ శ్రీ ముంగర రామ ప్రసాద్ రెడ్డి పై జిల్లా కోర్టు O.S. 133/75 నెంబరున దావా తెచ్చి 28.8.75 తేదిన డిక్రీని పొంది యుండి, 25.11.86 న హై కోర్టు వారిచే డిక్రీ ఖాయము చేయబడి సదరు డిక్రీ వసూలు నిమిత్తము, శ్రీ రామప్రసాద్ రెడ్డి పై జిల్లా కోర్టులో E.P. నెంబరు 3/85 దాఖలు చేయబడి, శ్రీ రామప్రసాద్ రెడ్డికి హక్కు అనుభవము గల షెడ్యూల్ దాఖలా ఆస్తిని 5.2.90 తేదిన కోర్టులో వేలం వేయబడి సదరు వేలములో నా క్లయింట్ రామ సుబ్బమ్మచే కొనబడి 16.4.90 తేదిన కోర్టులో వేలము ఖాయము చేయబడి, కోర్టు ద్వారా 29.8.90 తేదిన స్వాధీన[illegible] చేసుకొని సర్వహక్కులు [illegible] న్నది. నా క్లయింట్ రామసు[illegible] సదరు భూమిని అమ్మదలచి యున్నది. కాన కొనదలచిన వారు సదరు రామ సుబ్బమ్మను, చంద్రమౌళి నగర్, 8వ వీధిలో, హౌసింగ్ బోర్డు ప్రక్కన కాని, నా వద్ద కాని వివరములు తెలుసు కొనవచ్చును.

**ఆస్థి షెడ్యూలు**

నెల్లూరు జిల్లా రిజిష్ట్రేషన్, ఇందుకూరు పే[illegible] సబ్ రిజిష్ట్రేషన్, ఇందుకూరు పేట మండలం, [illegible]రసా పురం గ్రామము.

**మాగాణి భూమి**

సర్వే నం. 392 లో ఎ. 4.60 ట్లకు గాను ఎ.3.00లు 1.840 హెక్టార్లు.

**హద్దులు**

తూర్పు: ప్రకాశం గారి పొలము; దక్షిణము: ముంగర రామప్రసాద్ గారి పొలము; పడమర: నీటి పారుదల కాలువ, ఉత్తరం: ముంగర రామ ప్రసాద్ గారి పొలము.

కె.వి. రమణయ్య
అడ్వకేటు, నెల్లూరు

అందువల్ల ఆయన తరఫున వారి కుటుంబ సభ్యులు, కొందరు కేంద్ర మంత్రులు అంత్య క్రియలలో పాల్గొన బోతున్నారు.

అంత్యక్రియలు 14 తేది మధ్యాహ్నం 3 గంటల ప్రాంతంలో జరుగుతాయి.

### జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి ఈ రోజు (13 తేది) నెల్లూరు వస్తున్నారు; రేపటి వరకు ఇక్కడే వుంటారు.

### ఇన్‌ఛార్జి మంత్రి హరికృష్ణ

నెల్లూరు జిల్లా ఇన్‌ఛార్జి మంత్రిగా శ్రీ హరికృష్ణ నియమితులైనారు; రమేష్‌రెడ్డి మాట ఇక వేదవాక్కుగా చలామణి అవుతుంది జిల్లాలో!

### కొత్త మంత్రులు

కొత్త మంత్రులు శ్రీ టి. రమేష్ రెడ్డి 12 తేది, శ్రీ దుర్గా ప్రసాద్ 13 తేది నెల్లూరు వచ్చారు. వారి కార్యక్రమాలు ఇంకా తెలియదు. ఈ పర్యటనలు అభినందలకే పరిమితం కావచ్చు.

### జానకిరాం కాంగ్రెసేనట

మాజీ మంత్రి శ్రీ మాదాల జానకి రాం ఎన్టీఆర్ గూటిలో చేరి పోతున్నాడని రెండు వారాల క్రితం మేము వ్రాసిన వార్త నిజం కాదని ఆయన ఒక వివరణ పంపారు.

"ఎన్టి రామారావు గారు ఎక్కడైనా తారసపడితే అభివాదం చేయడం తప్ప, గత పదేళ్లలో నాకు గుర్తున్నంత వరకు ఎప్పుడూ కలవ లేదు. రాజకీయ లబ్ది కోసం, పదవుల కోసం పార్టీలు మార్చే ఉద్దేశ్యం నాకెన్నడూ లేదు. రాజకీయాలు నా వృత్తి కాదు. రాజకీయ రంగులు మార్చే వాడిగా ముద్ర పడడం నాకెన్నడూ ఇష్టం లేదు. కాంగ్రెస్ పార్టీతో క్రియాశీలక రాజకీయాలు ప్రారంభించాను. రాజకీయాల్లో వున్నంత వరకు కాంగ్రెస్ పార్టీలోనే వుంటాను" ఇదీ జానకి రాం వివరణ.

జానకి రాంకు చాలా సన్నిహితుడైన వ్యక్తి విశ్వస నీయంగా చెప్తే మేము ఆ వార్త ప్రచురించడం జరిగింది. అది తప్పయితే మన్నించమని మనవి. కోడలు కొడుకుని కంటా నంటే అత్త వద్దంటుందా? జానకి రాం కాంగ్రెస్‌లోనే వుంటానంటే అందరితో పాటు మాకూ సంతోషమే కదా!

వివరణ సంగతి తర్వాత కాని, జానకి రాం చేతి వ్రాత మాత్రం చాలా అందంగా వుంది; అంత ముచ్చటైన వ్రాత వ్రాయగల్గి నందుకు జానకి రాంను అభినందించాలి.

### ఓటర్లకు ఫోటోలు

పార్లమెంట్ ఎన్నికలకు ఓటర్ల జాబితా తయారీలో భాగంగా ఓటర్లకు [illegible] కార్యక్రమం జిల్లాలో [illegible]గుతూంది. అధికారులు ఎంత ప్రచారం చేసినా, ఓటరు గుర్తింపు [illegible] లేకుంటే బ్రతుకే వ్యర్థమన్నట్లు [illegible]పెట్టినా జనం ఫోటోలు దిగడానికి పోలింగ్ బూతుల వద్దకు వెళ్లడం లేదు. కొన్ని నియోజక వర్గాలలో పాతిక వంతు ఓటర్లు కూడా ఫోటోలు తీయించు కోలేదట.

ఇందులో అధికార్ల తప్పూ వుంది. నెల్లూరు టౌన్‌కు సంబంధించి ఒకే ఒక రోజు సమయం కేటాయించారు. 14 తేది స్టోన్‌హౌస్ పేట, బాలాజీ నగర్, సంతపేట వగైరాలలో; 15 తేది పాత టౌన్, దర్గామిట్ట, వెంగళ రావు నగర్ వగైరా ప్రాంతాలలో ఫోటోలు తీస్తారట. ఆ ఒక్క రోజు వూరిలో లేని వారు, వేరే పనులలో వున్న వారి పరిస్థితి ఏమిటి? అసలు ఓటర్లను బూతులకు రమ్మనడమే తప్పు. ఎవరి ఇళ్లలో వారి ఫోటోలు తీసే ఏర్పాటు వుండి వుంటే ఈ కార్యక్రమం విజయ వంతమయ్యేది. అది వీలు కాని పక్షంలో కనీసం వారం రోజుల పాటు బూతుల వద్ద ఫోటోలు తీసే ఏర్పాటు చేసి, విస్తృత ప్రచారం కల్పించి వుండాల్సింది. ఒకే ఒక్క రోజు అంక్ష పెడితే ఎవరు లెక్కచేస్తారు? ముందుగా తగిన సమాచారం కూడా లేదు. ఇప్పటి కిప్పుడు చెప్తే ఎందరికి వీలౌతుంది?

ఫోటో కార్డు వుండి తీరాలని పట్టుబడితే మాత్రం రేపటి ఎన్నికకు ఓటర్లు సగం మంది కూడా వుండరు. అధికారులు పునరాలో చించాలి.

### దుర్గాప్రసాద్‌కు వేమారెడి స్వాగతం

స్కూల్ [illegible]త్రిగా తొలిసారి గూడూరు వచ్చిన శ్రీ బల్లి దుర్గా ప్రసాద్‌కు - తెలుగు దేశంలో వుండనూ లేక, వదలి వెళ్లనూ దారి కన్పడక ఉక్కపోత ననుభవిస్తున్న శ్రీ వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గారు ఒక్కరే స్టేషన్‌కు వెళ్లి స్వాగతం చెప్పడం విశేషం. గూడూరు మునిసిపల్ ఛైర్మన్ గాని, ఇతర ముఖ్య తెలుగు నాయకు లెవ్వరూ కానీ స్టేషన్‌కు రాలేదు. చెప్పుకో దగిన వారు చేవూరు విజయ మోహన రెడ్డి, కోడూరు శ్రీనివాసులు రెడ్డిలు మాత్రమే. ఎమ్మెల్యే లెవరూ ఆ ఛాయలలో కన్పడలేదు.

ఎన్‌సి, ప్రసన్నలు మాత్రం తాము ఎన్టీఆర్‌తోనే వున్నా, తమ వారినందరినీ మంత్రి దగ్గరకు [illegible] పూల మాలలు వేయించారు.

### ఆఫీసర్స్ క్లబ్‌లో ఐదు లక్షలు స్వాహా?

నెల్లూరు చెరువు కట్ట మీ[illegible] వుండే ఆఫీసర్స్ క్లబ్‌కు సంబం ధించి[illegible] 5 లక్షల 75 వేల రూపాయల నిధులను క్లబ్ నిర్వాహకుడు, నెల్లూరు యువ కేంద్రం కోఆర్డినేటరు శ్రీ కె. సుధాకర రెడ్డి గుటకాయ స్వాహా చేశారని ఆరోపణ. క్లబ్ సభ్యులు ఎంత గలభా చేసినా ఆయన లెక్కలు చెప్పలేదట. ఇంక మాటలతో లాభం లేదని సభ్యులందరూ చేరి రచ్చ చేసి క్లబ్‌కు సంబంధించిన లెక్క పుస్తకాలు, తాళాలు అతడి వద్ద నుంచి పెరుక్కున్నారట. ఇందు కోసం పెద్ద ఘర్షణే జరిగి నట్లుంది. చొక్కాలు చినిగాయట.

సుధాకర రెడ్డి తనేశాడని భావిస్తున్న 5 లక్షల నష్టం పూడ్చు కోవడానికి చిట్ల పేక మేక్ మొత్తం [illegible] రెండు నుంచి రు. 15 లకు హెచ్చించారు. గబ్బు గబ్బుగా వుంది క్లబ్ వ్యవహారం.

ఈ క్లబ్‌కు కలెక్టరు ఛైర్మన్; ఎస్‌పి వైస్ ఛైర్మన్. అంత ఉన్నత పదవుల్లో వున్న వారి పేరు భ్రష్టు పట్టించేట్లు క్లబ్‌ను చీట్లాట కేంద్రంగా మార్చేశారు. పొద్దుట నుంచి రాత్రి వరకు అదే తంతు. జనాన్ని పీడించి తినే లంచాల మొత్తాన్ని ఇక్కడకొచ్చి జూదంలో తగలేస్తున్నారు "ఆఫీసర్లు"! కొందరైతే ఆఫీసులకు కూడా ఎగనామం పెట్టి ఆటలో రాత్రింబవళ్లు నిమగ్నులై వుంటున్నారట.

కలెక్టర్ పేరుతో నడిచే క్లబ్ జూదశాలగా మారడం దారుణం. గిరిధర్ గారు ఒక సారి అటు వెళ్లి చూసి క్లబ్‌ను దారికి తేవడం బాగుంటుంది; అలివి కాకుంటే క్లబ్‌ను మూసి పారేయడం మేలు - కొన్ని కుటుంబాలైనా బాగు పడ్తాయి.

క్లబ్ నిధులు ఐదు లక్షలు భోంచేసిన వారి నుంచి తాళాలు తీసుకొంటే సరిపోతుందా? క్లబ్ లోనే కాదు, నెహ్రూ యువ కేంద్రం నిర్వహణలో సైతం సుధాకర రెడ్డి గారి చేతి వాటం జోరుగా వున్నాదని చెప్తున్నారు. లక్షల నిధులు ఢిల్లీ నుంచి రావడమైతే తెలుస్తున్నది కాని, అవి ఎటు పోతున్నాయో అర్థమే కావడం లేదు. కార్యక్రమాలన్నీ కాగితాలకే పరిమిత మౌతున్నాయి. ఏళ్ల తరబడి బదలీలు లేకుండా, అడిగే వాడు లేకుండా సంస్థ పెత్తనాలు ఒకరికే అప్ప చెప్తే ఇటువంటి గోల్మాళ్లు గుటకాయ స్వాహాలు తప్పవు. క్లబ్ లెక్కలు పరిశీలించి, తిన్న మొత్తం తేల్చి, రాబట్టు కోవడం కలెక్టర్ గారి కర్తవ్యం.

### డిఎం అండ్ హెచ్‌ఒ

నెల్లూరు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధి కారి శ్రీ జెసి నారాయణ రిటైరైనారు; చిత్తూరు నుంచి డాక్టర్ ఎన్. పూర్ణిమ బదలీ పై వచ్చి ఆ స్థానంలో ఛార్జీ తీసుకున్నారు.

**మంత్రిత్వాలు**
7పేజీ కొరవ

రెప్పలా కాపాడే బాధ్యత మంత్రులదే! అందువల్ల తమ ప్రభావాన్ని, ప్రాభవాన్ని విస్తరించుకొనే అవకాశం మంత్రులకు లభించ దనాలి!

* * *

ఖజానా దివాలా తీసిన దశలో మంత్రు లిద్దరూ జిల్లాకు చేయగల్గిన, చేయదగిన అభివృద్ధి పనులంటూ వుంటాయని భావించటేము. థర్మల్ స్టేషన్, ఓడ రేవు, బైపాస్ రోడ్డు వంటి అరిగి పోయిన గ్రామ్ ఫోన్ రికార్డును వీరి కోసం మరొకసారి ప్లే చేయవలసిన అగత్యమేమీ లేదు. జెండా రెపరెప లాడే కారు, ముందు వెనుక ఎస్కార్టు, పోలీస్ స్టేషన్‌లలో, ఎమ్మార్వో ఆఫీసుల్లో ఫోన్ల మీద దబాయించే సౌలభ్యం కల్గాయని సరిపెట్టు కోవలసిందే!

* * *

మంత్రిత్వాలు పొందిన ఇద్దర యువ నాయకులనూ జమీన్‌రైతు మనసారా అభినందిస్తూంది!

**పెళ్లకూరు**
7పేజీ కొరవ

సముడు అన్పించు కున్నారు. ఆ చిరు పదవిలో వున్నప్పుడే, పెన్న డెల్టా ఆధునికరణ పథకం మంజూరు చేయించి నెల్లూరు, కోవూరు డెల్టా రైతాంగానికి మహోపకారం చేశాడు. రామచంద్రా రెడ్డి గారు మంచి రైతు. సేద్యంలోని మెళకువలు, బాధలు బాగా తెలుసు. రైతాంగానికి ఆయనతో సాన్నిహిత్యం పెరగడానికి అదే కారణం.

పరమ భక్తుడు కూడా! కుర్తాళం స్వామికి శిష్య పరమాణువు. నిష్ఠగా పూజలు, పునస్కారాలు చేసే వాడు. ఏ గుడి కన్పడినా మ్రొక్కే వాడు; స్వాముల వారందరికీ సాగిల పడే వాడు. భార్య మరణా నంతరం ఆయన చాలా కాలం విరాగి వలె గడిపారు. ఆ సమయంలోనే తన భార్య పేరిట కళ్యాణ మండపం నిర్మించి, అక్కడ నిత్యం 50 మంది పేదలకు అన్న దానం జరిపే కార్యక్రమం ప్రారంభించారు. ఆ తర్వాత మళ్లీ రాజకీయాలలో చురుకుగా పాల్గొన్నా, ఆ కార్యక్రమం మాత్రం ఇప్పటికీ కొనసాగుతూనే వుంది.

రామచంద్రా రెడ్డి గారి రాజకీయ జీవితం నిష్కళంక మైనది. ప్రజా జీవితంలో నిరాడం బరతకు, నిజాయితీకి సంకేతంగా వుండినారు. ఎప్పుడూ ఎవరి చేతా వేలెత్తి చూపించు కోలేదు. కేంద్ర మంత్రితో సమమైన హోదాలో వుండినా భేషజం దరి చేర నివ్వలేదు. అరుదైన వ్యక్తిత్వం ఆయనది.

రామచంద్రా రెడ్డి గారికి ముగ్గురు కుమారులు; ఇద్దరు కుమార్తెలు. వారి కుటుంబానికి మా ప్రగాఢ సంతాపం!

# లక్ష్మిపార్వతి పై చేసిన ఆగం రమేష్‌రెడ్డికి, మంత్రిత్వభాగ్యం

# - చంద్రబాబుతో స్నేహం దుర్గాప్రసాద్‌కు కల్పించాయి!

జిల్లాకు అసలు మంత్రి పదవి వుంటుందా, వుండదా అనే సందేహంలో వుండిన వారందరినీ ఆశ్చర్య పరుస్తూ ఒకేసారి ఇద్దరికి మంత్రిత్వ యోగం పట్టించారు ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు. నిజంగా అబ్బురమీ వేసం. పోర్టు ఫోలియోలూ గట్టివే! మార్కెటింగ్ మంత్రిగా శ్రీ టి. రమేష్ రెడ్డి, సెకండరీ విద్యా శాఖ మంత్రిగా శ్రీ బల్లి దుర్గా ప్రసాద్ పదవీ ప్రమాణాలు చేశారు.

రమేష్ రెడ్డి మంత్రిత్వం వూహించిందే! దుర్గా ప్రసాద్ ఎంపిక సర్‌ప్రైజ్ సెలక్షన్! ఎన్‌టిఆర్ కుటుంబ సభ్యుల నుంచి వచ్చిన వత్తిడి, ముఖ్యంగా హరికృష్ణ పట్టుదల రమేష్ రెడ్డికి పదవీ యోగం కల్పించాయి. రాజకీయంగా ఆలోచించినా రమేష్ రెడ్డికే మంత్రిత్వ అర్హత. లక్ష్మి పార్వతి వ్యతిరేక ఉద్యమానికి అంకురార్పణ చేసిన వాడు రమేష్ రెడ్డి; ఎన్టీఆర్ ఆగ్రహానికి తొలి సమిధ అయ్యింది కూడా అతడే; హరికృష్ణను వీధుల్లోకి లాగింది అతడే! ఈ చర్యలే తర్వాత తర్వాత ఎన్‌టిఆర్ పదవీ భ్రష్టత్వానికి కారణా లైనాయి. ఆ కోణం నుంచి చూసినప్పుడు మొదటి క్యాబినెట్‌లోనే రమేష్ రెడ్డికి ఛాన్సు లభించి వుండాలి.

మధ్యలో చంద్రమోహన్ రెడ్డి పేరు వచ్చింది. చాలా ఆశ పెట్టారు పాపమాయన్ను. ఒకరికి ఇద్దరు పారిశ్రామిక వేత్తలు చంద్రమోహన రెడ్డిని స్పాన్సర్ చేశారు. పై స్థాయిలో ఒత్తిడి తెచ్చారు. అది చూసి అందరూ చంద్ర మోహన రెడ్డికి పదవి గ్యారంటీ అన్నారు. రాజ్‌భవన్‌లో ప్రమాణ స్వీకారం జరుగు తున్నప్పుడు కూడా ఆయనలో ఆశ కొటుక లాడ్తుందింది. దిన పత్రికలన్నీ ఆయన పేరే ప్రకటించాయి. కాని తెలుగు దేశం రాజకీయం తీరు, చంద్రబాబు వ్యవహార శైలి ఏ మాత్రం అర్థం చేసుకో గల్గినా చంద్ర మోహన రెడ్డికి మంత్రిత్వం రావడం అసాధ్యమన్న నిజం అవగతమై వుండేది. జమీన్‌రైతు ఒక్కటే స్పష్టంగా రమేష్ రెడ్డి పేరును వూహించింది; చంద్ర మోహన రెడ్డికి అవకాశం లేదని స్పష్టంగా ప్రకటించింది.

మంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తున్న టి. రమేష్ రెడ్డి

బల్లి దుర్గా ప్రసాద్‌కు పట్టిన అదృష్టం కేవలం - స్నేహ బలమే. పూర్వాశ్రమం రోజుల నుంచి చంద్రబాబు పట్ల విధేయతతో మెలిగి నందుకు దుర్గా ప్రసాద్ మంత్రిత్వ బహుమానం అందుకున్నారు.

* * *

రమేష్ రెడ్డి మహర్జాతకుడు. ఎమ్మెల్యేగా మొదటి సారి గెల్చి మంత్రిత్వం పొందడం జాతక మహిమే కదా! వయస్సూ చిన్నది - 42 ఏళ్లు. ఎన్టీఆర్ అభిమానిగా రాజకీయాలలోకి వచ్చాడు; ఈ రోజుకీ మానసిక [illegible] అదే స్థాయిలో వుంది; మాన[illegible] మునిసిపల్ ఛైర్మన్‌గా పని చేసిన అనుభవం మంత్రిత్వ నిర్వహణలో వుపక రిస్తుందను కొంటాము. ఛైర్మన్‌గా రమేష్ రెడ్డి చాలా మంచి పేరు తెచ్చుకున్నారు; జన రంజకత్వం సాధించాడు; తానుగా అవినీతి జోలికి పోలేదు. ఛైర్మన్‌గా దిగిపోయి, ఎన్‌టిఆర్ అధికారం కోల్పోయిన రోజులలో రమేష్ రెడ్డి పడిన ఆర్థిక ఇబ్బందులే అతడి నిజాయితీకి రుజువు.

ఎన్టీఆర్, హరికృష్ణల చలవతో పదవులు పొందడం తప్ప, రాజకీయ పరంగా జిల్లాలో ఒక వర్గాన్ని ఏర్పర్చడం, పది మందిని కూడ గట్టుకొని ప్రవర్తించడం పై ఆసక్తి లేదు. స్నేహితులు తప్ప, అనుచరులు లేరు.

దుర్గా ప్రసాద్ లౌకికుడు. తెలుగు దేశం హరిజన శాసన సభ్యులందరిలోకీ సీనియర్. కీలక మెరిగి ప్రవర్తించడం తెలిసిన వారు. నల్లపరెడ్ల మర్రి చెట్టు నీడలో నిశ్శబ్దంగా తన కంటూ ఒక అనుచర వర్గం తయారు చేసుకున్న చతురుడు. అందరితో వినయంగా వున్నట్లు కన్పిస్తాడు కానీ, ఎవరికీ లొంగని ఘటికుడు. హరిజనులలో మంచి ఫాలోయింగ్ వుంది. విద్యాధికుడు; స్పష్టంగా మాట్లాడి అధికార్ల చేత పని చేయించుకో గల్గిన నేర్పరి.

* * *

మంత్రిత్వాలు లభించి నప్పటికీ జిల్లాలో ఇతర ఎమ్మెల్యేల పై పెత్తనం చేయగల అవకాశం ఇద్దరికీ లేదు.

చంద్రబాబు ప్రభుత్వంలో ఎమ్మెల్యేలు రాజలైతే - మంత్రులు [illegible]

ఎమ్మెల్యేలు అలగకుండా, ఆగ్రహించ కుండా, గోడ దూకి వెళ్లకుండా కంటికి

కొరవ 6 పేజీలో

# వేలెత్తి చూపే తప్పన్నది చేయని నిష్కళంక జీవి!

ముఖంతోనే వుండినారు. ఎటువంటి నొప్పి, బాధ అనుభవించ లేదు. ఆ తర్వాత ఏమి జరిగిందీ ఆయనకు తెలియదు. ఎంత పుణ్యం చేసుకుంటే ఇంతటి సుఖ మరణం ప్రాప్తిస్తుంది! రామచంద్రా రెడ్డి గారు [illegible] పుణ్యజీవి.

రామచంద్రా రెడ్డి గారు జిల్లాలో సీనియర్ రాజకీయ వాది. ఆయన కిప్పుడు 73 ఏళ్లు, గోపాల రెడ్డి గారిని మినహాయిస్తే, ఆనం సంజీవ రెడ్డి ఒక్కడే ఆయన సమకాలికుడు. గ్రామ స్థాయి నుంచి ఢిల్లీ వరకు అంచ లంచెలుగా ఎదిగిన వారాయన. 1953 లో రామన్న పాళెం సర్పంచ్‌గా ఎన్నికైనారు. ఇప్పుడు జిల్లా పరిషత్‌గా పిలవబడే జిలా పంచాయితీ సంఘం అధ్యక్షుడుగా 1956లోనే పనిచేశారు. శాసన సభలో తొలిసారిగా అడుగు పెట్టింది 196[illegible]లో! రంగా గారి రైతు ఉద్యమాల పట్ల ప్రభావితుడై, జిల్లా కిసాన్ సమ్మేళన ప్రారంభించి, దానికి అధ్యక్షుడుగా పని చేసి, ఆ ఉత్సాహంతోనే రంగా గారి స్వతంత్ర పార్టీ అభ్యర్థిగా 1967లో ఆత్మకూరు నుంచి పోటీ చేసి, ఆనం సంజీవ రెడ్డిని ఓడించాడు. అప్పట్లో అది సంచల నాత్మక విజయం; ఆనం వారి ప్రభ దేదీప్య మానంగా వెలుగొందు తుండిన సమయంలో వారిని ఎదిరించి నిలబడడమే సాహసమను కుంటుండిన పరిస్థితులలో గెలుపు సాధించారంటే ఆ రోజుల్లో రామ చంద్రా రెడ్డి గారి జన ప్రియత్వం అర్థం చేసుకోవచ్చు. ఆ తర్వాత 1971 లో స్వతంత్ర పార్టీకి రాజీనామా చేసి ఇందిరా కాంగ్రెస్‌లో చేరారు. 1972, 1978 లలో కోవూరు నుంచి గెలుపొందారు.

దాదాపు పాతికేళ్ల నుంచి రామచంద్రా రెడ్డి గారు ప్రధాని శ్రీ పివి నరసింహా రావు అనుచరులు. ఏ సుముహూర్తంలో వారి మధ్య స్నేహ భావం అంకు రించిందో కాని, అది ఆజన్మాంతం గాఢాను బంధంగా నిల్చింది. నిజానికి 1992లో ఇఫ్కో

దశలో ఆయనకది ఎంత సంతృప్తి నిచ్చిందో చెప్పలేము. రాష్ట్రం ఎల్లలు దాటి ఎరుగని ఆయన ఇఫ్కో అధ్యక్షుడుగా ప్రపంచం యావత్తు చుట్టబెట్టాడు. అమెరికా, జపాన్, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, సౌత్ ఆఫ్రికా వంటి దేశాలకు పలు మార్లు వెళ్లాడు. లాల్చీ, ఖద్దరు ధోవతులు విడిచి సూటు, బూటు వేశాడు. నాలుగేళ్ల క్రితం బైపాస్ ఆపరేషన్ చేయించుకున్న బలహీనతను, వయసును మరచి పిల్లవాడి వలె

## పెళ్లకూరు

(మొదటి పేజీ కొరవ)

అధ్యక్షుడిగా నియమించే వరకు పివి ఆయనకు చేసిన రాజకీయోప కారం ఏమీ లేదు. పివి రాష్ట్ర ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఆయనకు రాష్ట్ర మంత్రిత్వం కూడా ఇవ్వలేదు; ఆయన్ను ఎప్పుడూ ఏ పదవికీ సిఫార్సు చేయలేదు. కానీ స్నేహితానికి పదవుల పందారం కొలమానం కాదన్నట్లు తుది శ్వాస విడిచే వరకు పివి నామ జపం చేస్తూనే గడిపారు రామచంద్రా రెడ్డి గారు; రామ భక్త హనుమాన్ వలె వుండినారు. ఈ విశ్వాస పాత్రత, విధేయత పివి ప్రధాని అయిన తర్వాత ఉపకరించాయి. రాజకీయ అజ్ఞాత[illegible] స్వాముల వారి సేవలో కృష్ణ [illegible] అంటూ కాలం గడుపు తుండిన రామచంద్రా రెడ్డి గారిని ఢిల్లీకి పిలిపించి, వేల కోట్ల వ్యాపారం కల్గిన ఇఫ్కో సంస్థకు అధ్యక్షుడ్ని చేశారు. చివరి

చలాకీగా తిరిగేవాడు.

ఇఫ్కో అధ్యక్షుడుగానే, నెల్లూరుకు 1400 కోట్ల ఎరువుల కర్మాగారం తరలించుకొని వచ్చారాయన. దానికి ప్రధాని చేత శంకుస్థాపన చేయించాలని వువ్విళ్లూరు తుండినారు. ఆ ముచ్చట తీరక ముందే భగవంతుడు తీసుకు వెళ్లిపోయాడు. రామచంద్రా రెడ్డి గారి పేరు జిల్లా చరిత్రలో చిరస్థాయిగా నిల్చిపోయే కృషి అది.

రాజకీయంగా రామచంద్రా రెడ్డి గారు అంత రాణించ లేక పోయారు. మూడు సార్లు ఎమ్మెల్యే అయినా ఆయనకు జిల్లాలో స్వంత వర్గం లేదు. ఏ జిల్లా నాయకుడికీ తాను అనుబంధితుడు కాడు; తనకు తానుగా నాయకు డన్పించు కోలేక పోయాడు. రాష్ట్ర మంత్రి కావాలనే కోరిక ఆయనలో [illegible]

కంజయ్య హయాంలో కోస్తాంధ్ర అభివృద్ధి వుండటి ఛైర్మన్‌గా మంత్రి

కొరవ 6 పేజీలో

## దొంగనోట్లు

5 పేజీ కొరవ

కట్టబోయే సరికి నిధులు సరిపోక పోతే మాజీ ముఖ్యమంత్రి జనార్ధన రెడ్డిని ఒప్పించి నిధులు తెచ్చానన్నా రాయన. టి.వి. రిలేస్టేషన్ కోసం తాను పడిన కష్టం ప్రజలకు తెలును నంటూ, సమ్మర్ స్టోరేజి ట్యాంకు ప్రగతి గూర్చి వేణు గోపాల రెడ్డి కాసింత తెలుసుకొని మాట్లాడాలని సలహా యిచ్చారాయన. తాను అధికారులతో మంచిగా వుండి పనులు సాధిస్తానని, ప్రత్యర్థి రాజకీయ నాయకుల పై మాత్రమే పోరాటం చేస్తానని చెప్పుకొన్నారు. రాజకీయాలకు కొత్త అయిన వేణు గోపాల రెడ్డి మంచి పనులు చేసి గుర్తింపు తెచ్చుకోవాలే తప్ప, ఇతరులను విమర్శించి కాదనిహితవు చెప్పారు. ముఖ్యమంత్రితో సన్నిహితంగా వుండే వాడని చెప్పుకొంటున్న వేణుగోపాల రెడ్డి నియోజక వర్గ అభివృద్ధికి కొన్ని పనులు సాధించి పెట్టాలని సూచించారు. కావలి దేశం నాయకులు తమ ప్రత్యర్థుల పై ఎక్సైజ్ అధికారులను ఉసి గొల్పడం తగదని; ఆ శాఖ అధికారులు వాస్తవాలు తెలుసుకొని తరువాత కాంగ్రెస్ కార్యకర్తల జోలికి రావాలని అన్నారు. లేకుంటే తాను ఊరుకోనని వారికి కలికి [illegible]

## సణుగుడు

4 పేజీ కొరవ

ఎయిర్ బస్ క్యాబినెట్‌లతో విలువా పోయింది. పాత రోజుల్లో మంత్రి కావాలంటే, గ్రామ స్థాయి నుంచి అంచె లంచెలుగా ఎదిగి వచ్చి, రాజకీయ పోరాటాలు చేసి, ఒకటికి రెండు సార్లు ఎమ్మెల్యేగా గెల్చి, తన తోటి పది మంది ఎమ్మెల్యేలను అనుచరులుగా త్రిప్పుకో గల్గి, రాష్ట్ర స్థాయిలో ఒక గుర్తింపు పొందిన వారికే అవకాశం దక్కేది. వారికి అధికారులలో, జనంలో మంత్రి అన్న గౌరవం, విలువ లభించేవి. ఇప్పుడా పరిస్థితి లేదు; ఎమ్మెల్యేగా ఎప్పుడూ గెలవక పోయినా మంత్రులై పోతున్నారు. అర్హతకు నిర్వచనాలు మారిపోయాయి. తుమ్మితే వూడే ముక్కు వలె ఎప్పుడు వూడి పోతుందో తెలియని భయంతో కాలం గడిపే దుస్థితి. దీని ఫలితం గానే, అధికారులలో, అనుచరులలో మంత్రంటే భయం లేదు; ఆ పదవి తన హుందాతనాన్ని కోల్పోయింది. కొత్తగా మంత్రులయ్యే వారు మారిన ఈ విలువను సదా గుర్తు పెట్టుకోవాలి. ఎన్ని కొట్లు గ్రేలితే తమకు విలువ పెరుగు తుందన్నది కాదు - ఎన్ని పనులు చేసి పెడితే ప్రతిష్ట పెరుగు తుందని ఆలోచించు కోవాలి!

ముఖ్యమంత్రి చంద్ర బాబే ఆడంబరాలకు, ఆట్ట హాసాలకు దూరంగా, పూల మాల కూడా వద్దని తప్పించుకు తిరుగు తున్నాడు; పరిస్థితు లటువంటివి. ఇక మంత్రులుగా వుండే వారు ఇంకెంత నిరాడంబరంగా, [illegible]

## జనవాణి

3 పేజీ తరువా

వచ్చిందంటే దాని అర్థమేమిటి? ఈ విధానం ఎన్నాళ్లు కొనసాగుతుంది. ఒకవేళ కొనసాగినా భవిష్యత్తులో దీనివల్ల మరెన్ని సమస్యలు రానున్నాయో? ఈ విషయం అర్థం కావడం లేదు. ప్రస్తుతం వన్లయ్ చేస్తున్న వస్తువులు నాసిరకంగా వుంటూ, ప్రభుత్వం నష్టె చేస్తున్నట్లు వ్యాపారులు చెబుతున్నారు. రేట్ల తేడా విషయంలో సమగ్ర వివరణతో కూడిన వ్యాసాన్ని ఎవరైనా ఆర్థిక శాస్త్ర అధ్యాపకులు జమీన్‌రైతుకు పంపితే, అందులో ప్రచురిస్తే సామాన్యులకు లోతు విషయాలు అర్థం అవుతాయి.

నెల్లూరు -ఎన్.గిరిధర్

### మినీ బైపాస్ రోడ్డు రూటు మార్చండి!

నెల్లూరుకు మంజూరైన మినీ బైపాస్ రోడ్డు పని కొంత మేరకు జరిగింది. బైపాసు రోడ్డు ఇంకా అంచనాలు వేసే దశలోనే వున్నట్లుంది. నెల్లూరు టౌన్ అంచు, మించు వెంకటాచలం వరకు రోడ్డుకు ఇరు వైపులా రిబ్బన్ డైవులో పెరిగి పోతున్నది. ప్రస్తుతం వుండే మినీ బైపాస్ రోడ్డును వేదాయ పాళెం రైల్వే స్టేషన్‌కు దక్షిణపు వైపు రైలు కట్ట దాటించి, లింగాల చెరువు ఉత్తరపు అంచుకు తీసుకెళ్లి ట్రంకురోడ్డులో కలుపు తున్నారు. టౌన్ పెరిగే కొద్దీ మళ్లీ బుజబుజ నెల్లూరు, వెంకటా చలం మధ్యలో ట్రాఫిక్ పెరిగి పోయే అవకాశాలు మెండుగా వున్నాయి. కాబట్టి ఇపుడుండే బైపాసు రోడ్డును కల్లూరు పల్లి హౌసింగ్ బోర్డు కాలనీ మీదుగా కంబేపల్లి, వెంకటాచలం తూర్పున సర్వేపల్లి రోడ్డు దాటించి అప్పయ్య గేటుకు తూర్పున (ప్రస్తుతం వుండే ఓవరు బ్రిడ్జి) వరకు కలిపితే బాగుంటుంది. దీని వల్ల వేదాయపాళెం

రైల్వే గేటు వద్ద ఓవర్ బ్రిడ్జి కట్టాల్సిన ఖర్చు తగ్గిపోతుంది. వెంకటాచలం నెల్లూరు మధ్యలో ట్రాఫిక్ సులభంగా కొనసాగుతుంది. అధికారులు ఈ ప్రతిపాదనను పరిశీలించాలని మనవి.

నెల్లూరు -కె. విజయకుమార్

### టౌన్‌లో వ్యాధి నిరోధక చర్యలు చేపట్టాలి!

నెల్లూరు టౌన్ పారిశుధ్య విషయమై అత్యంత అధ్వాన్న స్థితిలో వుంటున్నది. పలు ప్రాంతాల్లో చెత్త రోజుల తరబడి పేరుక పోయి, కాల్వలు శుభ్ర పరచక మురికి నీరు రోడ్ల పై ప్రవహిస్తున్నది. గత వారం రోజులుగా కురుస్తున్న వర్షాలకు పరిస్థితి మరింత దిగజారి పోయింది. మునిసి పాలిటీకి ప్రజారోగ్యం మెరుగు పర్చాలని వున్నా నిధుల కొరత వల్ల, పనిచేస్తున్న సిబ్బంది వారానికి ఒక్క రోజు కూడా తమ విధులు నిర్వహించనందు వల్ల టౌన్ కంపు కొడుతూంది. ఈ వాతావరణంలోనే దోమలు, ఈగల వల్ల కలరా, మసూచి, ఫైలేరియా, మలేరియా, విష జ్వరాలు, మెదడు వాపు వ్యాధి ప్రబలే ప్రమాదం వుంది ఈ స్థితిలో రాష్ట్ర ప్రభుత్వం ముందు జాగ్రత్త చర్యగా అత్యవసరంగా కొత్త మొత్తం కేటాయించి వ్యాధి నిరోధక మందులు ప్రజలకు ... చేయాలి. కడప జిల్లాలో

గత నెలలో విష జ్వ...తో పదుల సంఖ్యలో ప్రజలు చనిపోగా దానికి కారణం కలుషిత నీరని తేలింది. వీటి సరఫరా విషయంలో కూడా టౌన్‌లోని ప్రజలు అప్రమత్తంగా వుండాలి. విధి నిర్వహణ విస్మరించి నిరంతరం జోగుతూ వుండే వైద్య ఆరోగ్య శాఖ, మలేరియా, ఫైలేరియా డిపార్టు మెంటులను ఇన్‌ఛార్జి కలెక్టర్ నిద్రలేపి సంసిద్ధులుగా వుంచాలి.

నెల్లూరు -బి. పట్టాభిరామయ్య

### అధికారుల పై నాయకుల జులుం తగదు!

వార్తాపత్రికలు చూస్తుంటే అధికార్ల పై రాజకీయ నాయకుల జులుం జిల్లాలో ఏదో మూల నిత్యం జరుగు తున్నట్లు వార్తలు వస్తున్నాయి. ఉద్యోగులు పర్మనెంట్ ప్రజా సేవకులు -రాజకీయ నాయకులు తాత్కాలిక ప్రజా సేవకులు. అటువంటప్పుడు నర మంత్రపు మిడిసిపాటు పడటం, అధికార్లను బెదిరించడం తగదు. అధికార్లలో నైతిక విలువలు పెంచి పోషించాల్సిన రాజకీయ నాయకులు అరాచకానికి పాల్పడితే ప్రజా స్వామ్యానికే ప్రమాదం ఏర్పడే అవకాశాలు వున్నాయి. కాబట్టి సామ్య విధానాన్ని ఇరు వర్గాలూ అవలంబించటం ఉత్తమం.

గూడూరు -కె. రఘురామయ్య

### జాతీయగీతం

ఇది వరలో సినిమా హాళ్లలో సినిమా పూర్తి కాగానే జాతీయ గీతం రికార్డు పెట్టే వారు. అది పూర్తయ్యే వరకు ప్రేక్షకులు నిలబడి వుండి, తరువాత హాలు బయటకు వచ్చే వారు. కాని చాలా ఏళ్లుగా ఈ విధానానికి స్వస్తి చెప్పారు. ప్రస్తుతం వెంట వెంటనే ప్రదర్శనలు మొదలు పెడుతున్నందు వల్ల ప్రేక్షకులకు ఓపిక లేకుండా పోయింది. థియేటరు యజమానులకు జాతీయ గీతం ప్రసారం చేసే ఆసక్తి కూడా లేదు. అదే విధంగా సినిమా ప్రారంభానికి ముందు రెండు న్యూస్ రీళ్లు చూపించే వాళ్లు. వీటిలో కొంతైనా జనరల్ నాలెడ్జికి వుపయోగపడే అంశాలుండేవి. ఈ పద్ధతికి ప్రస్తుతం 99 శాతం సినిమా హాళ్లలో తిలోదకాలిచ్చారు. దీన్ని సరిదిద్దే ప్రభుత్వ శాఖాధికారే లేరు.

నెల్లూరు -ఎస్.వి.ఎస్. కోటేశ్వరరావు

### స్వాములు ఏదైనా చెబుతారు

తాంత్రికుడు చంద్రస్వామి విశ్వశాంతి కోసం యజ్ఞం నిర్వహిస్తా ననడం హాస్యాస్పదం. సంఘ విద్రోహ శక్తులతో, మాఫియా గ్యాంగులతో సంబంధాలున్నట్లు వస్తున్న పలు ఆరోపణల నుంచి జనం దృష్టి మళ్లించడం కోసమే స్వామి ఈఎత్తుగడ వేసినట్లుంది. అక్రమంగా ఆస్తులు సంపాదించి, అసాంఘిక శక్తులతో చేతులు కలిపిన చంద్రస్వామి విశ్వశాంతి కోసం పరితపిస్తు న్నాడంటే జనం నమ్మాలా? దేశంలోని పలువురు నాయకులను తన చేతుల్లో పెట్టుకొని తమ ఇష్టం వచ్చినట్లు సాగు ... కోవడం పొరపాటు. తాను విశ్వ...

పాటు ఆగ మన్నానని చంద్రస్వామి ప్రకటించు కోవడం ప్రజలు గమనిస్తూనే వున్నారు. వినేవాళ్లుంటే ఇటువంటి వారు ఇంకెంతటికైనా బరి తెగిస్తారు. కాబట్టి ప్రజలు ఇటు వంటి స్వాముల పట్ల అప్రమత్తంగా వుండాలి.

నెల్లూరు -వి.పద్మజ

### బ్యాంకుల్లో సమ్మె రద్దు చేయాలి!

బ్యాంకింగ్, సర్వీసుల్లో సమ్మెలను నిషేధించాలి. సంవత్సరంలో నాలుగైదు సార్లు సమ్మెల వల్ల బ్యాంకింగ్ కార్య కలాపాలకు విఘ్నం కల్గడం వల్ల ఖాతాదారులు పడరానిపాట్లు పడుతున్నారు. ఈ విషయం ప్రభుత్వానికి తెలియంది కాదు. ప్రైవేటు రంగంలో బ్యాంకులను ప్రోత్సహించడం ద్వారా ఖాతాదారులకు సదుపాయాలు కలుగజేయాలి. బ్యాంకింగ్ రంగంలో ప్రైవేటు సంస్థల ప్రవేశానికి వీలుగా రిజర్వు బ్యాంకు నిబంధనలను సరళ తరం చేస్తే సమ్మెలు మటు మాయం అవుతాయి.

నెల్లూరు -ఎన్. మల్లికార్జున రావు

### సబ్ వే కట్టించండి

బాధ్యత గల నాయకులు గాని, అధికార్లు గాని, కొద్ది సేపు కొత్త హాలు సెంటర్ వద్ద నిలబడితే రోడ్డును దాటి వెళ్లే వారి బాధ అర్థమవుతుంది. వచ్చే పోయే వాహనాల రద్దీ నియంత్రిం చేందుకు కానిస్టేబిల్ కూడా వుండడు. ముసలి, ముతక, స్త్రీలు రోడ్డు దాటాలంటే భయపడి పోతున్నారు. అత్తిలోట అగ్రహారంలోకి వెళితే ఇరుకైన త్రోవ. ఒక రిక్షా పోతే ఇంకో రిక్షా రావడానికి లేదు. కాబట్టి ఇక్కడ ఒక సబ్ వే అవసరం ఎంతైనా వుంది. తిప్పరాజు వారి కళ్యాణ మండపం కలిపే రోడ్డుకు, అటు, ఇటు ట్రంకు రోడ్డుకు సబ్ వే పెడితే ప్రజలు ఎంతో సంతోషిస్తారు. కొత్త మంత్రి రమేష్ రెడ్డి ఈ విషయంలో చొరవ తీసుకోవాలని మనవి.

నెల్లూరు -టి.వి. నారాయణ

## జిల్లావార్తలు

5 పేజీ తరువా

పోలియో చుక్కలు వేయించు కోకుండా వున్నట్లయితే అతని వల్ల రాబోయే కాలంలో వంద మంది పిల్లలు ఈ వ్యాధి సోకి శాశ్వతంగా అవిటి వారయ్యే ప్రమాద ముందని హెచ్చరించా రాయన. అభివృద్ధి చెందిన 150 దేశాల్లో ఈ పోలియో మహమ్మారిని తరిమి కొట్టారని, బీద దేశమైన మన దేశంలో నిధుల కొరత వల్ల, అవగాహన లోపం వల్ల సత్ఫలితాలు సాధించ లేకపోయినట్లు చెప్పారు. ప్రతి గ్రామానికి 10 మంది కార్యకర్తలను ఎంపిక చేసుకొని ఇంటింటికి వెళ్లి తల్లిదండ్రులకు పోలియో అనర్థాలను వివరించే కార్యక్రమాన్ని చేపట్టమని అధికారులకు సూచించారు. సభలో డి.ఆర్.డి.ఎ. ప్రాజెక్ట్ డైరక్టర్ వి.ఎన్. విష్ణు, జిల్లా వైద్య శాఖాధి కారిణి డాక్టర్ ఎస్. ఊర్మిళ, ఇమ్యునైజేషన్ అధికారి రంగారావు, ... శ్రీనివాస రాజు పాల్గొన్నారు.

### టంగుటూరి ట్రస్ట్- కాట రాక్టు ఆపరేషన్లు!

బృందం కావలి కాటరాక్టు ఆపరేషన్ల శిబిరాన్ని భారీ స్థాయిలో ఏర్పాటు చేసింది. టంగుటూరి ట్రస్ట్ తరపున 9తేది ప్రారంభమైన శిబిరం డాక్టర్ ఊర్మిజా నాయకత్వంలో 6 మంది సభ్యులు గల వైద్య బృందం రాష్ట్ర వ్యాప్తంగా తరలి వచ్చిన వందలాది మందిని పరీక్షిస్తున్నారు. రోజుకు 20 నుండి 30 మందికి ఆపరేషన్లు చేసి 7 వేల రూపాయలకు పైగా విలువ చేసే కాటరాక్టు లెన్సులను అమరుస్తున్నారు. ప్రారంభ సమావేశంలో శిబిర నిర్వాహకుడైన ట్రస్ట్ అధ్యక్షుడు శ్రీ టంగుటూరి రామకృష్ణ మాట్లాడారు. మూడు కోట్ల రూపాయల పరికరాలతో అమెరికా నుంచి కావలి విచ్చేసిన డాక్టర్ ఊర్మిజా, రోగులకు ఉచితంగా ఇచ్చేందుకు మందులు కూడా అమెరికా నుంచి తెచ్చినట్లు చెప్పారు. శిబిరానికి 10 రోజుల పాటు తన ఆసుపత్రిని ఉచితంగా ఇచ్చిన డాక్టర్ ఓబయ్యను రామకృష్ణ ప్రశంసించారు. డాక్టర్లు సత్యనారాయణ, పరమేశ్వర రెడ్డి, సుబ్బారావు తదితరులు మాట్లాడారు. శిబిరంలో 3,500 కంటి రోగులను పరీక్షించ నున్నారు. బెంగుళూరు, హైదరాబాద్, విజయవాడ, గుంటూరు వంటి దూర ప్రాంతాల నుండి 150 మంది కంటి డాక్టర్లు విచ్చేసి ఆపరేషన్లలో సహకరిస్తున్నారు. అమెరికాలో స్థిరపడిన కావలి వైశ్య ప్రముఖుడు టంగుటూరి సత్యనారాయణ కృషి వల్లే ఈ భారీ కాటరాక్ట్ శిబిరం ఏర్పాటయ్యింది. పలువురు అంధుల జీవితాల్లో మళ్లీ వెలుగులు నింపుతున్నది.

### అల్లూరులో కవితల పోటీలు

అల్లూరులో నవంబర్ 1 తేది జిల్లా స్థాయిలో కవితల పోటీని బడియో వాలెంటరీ ఆర్గనైజేషన్ నిర్వహిస్తుంది. సమకాలీన సమస్యల పై కవులు తమ కవితలను వాటిని చదవాలి. ఉత్తమ కవితలకు మూడు బహుమతులు కూడా ఇవ్వనున్నట్లు అసోసియేషన్ అధ్యక్షుడు కె. సుధీర్ కుమార్ రెడ్డి తెలియ జేస్తున్నారు.

### రాపూరుమీదుగా తిరుమలకు బస్సు

రాపూరు నుండి తిరుమల వెళ్లే బస్సు కోసం రాపూరు వాసులు తహతహ లాడిపోయారు. ఆ సౌకర్యం ఏర్పాటు చేస్తానని మాట ఇచ్చి తప్పిన డిపో మేనేజర్‌పై నేటికీ ప్రజలు మండి పడుతూనే వున్నారు. స్వంత డిపో వాళ్లు ప్రజల అవసరాలను గుర్తించకపోయినా వెంకటగిరి డిపో వారు రాపూరు వాసుల కోరిక తీర్చారు. వేకువ జామున 4.30 కు నెల్లూరు నుండి బయలు దేరి పొదలకూరు మీదుగా 6.30కు రాపూరు చేరి, వెంకటగిరి మీదుగా తిరుమల వెళ్లేటట్లు ఒక బస్సు ఏర్పాటు చ పేశారు; తిరుగు ప్రయాణానికి ఇదే రూటు. ఇది12 తేది నుండి ప్రారంభ మవుతుంది.

### విడవలూరు విద్యార్థి ప్రతిభ

విడవలూరు కళాశాల పూర్వ విద్యార్థి బొగ్గల మల్లికార్జున రావును అమెరికాలోని సిటి ర్యాలీ పట్టణంలో ఐ.బి.ఎం. కంపెనీ సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పని చేసేందుకు ఆహ్వానించింది. రావు బెంగుళూరులోని టాటా ఇన్ఫర్మేషన్ సిస్టమ్స్ లిమిటెడ్‌లో పని చేసేవారు. ఆయన పని తీరును గమనించిన టాటా సంస్థ ఐ.బి.ఎం. ఆహ్వానం పై అమెరికా పంపింది. మల్లికార్జున రావు గత వారం అమెరికా బయలుదేరి వెళ్లారు. ఇతని తండ్రి బొగ్గల శేషయ్య విడవలూరు ప్రభుత్వ కళాశాలలో రికార్డు అసిస్టెంటుగా పనిచేస్తున్నారు. తమ కళాశాల సిబ్బంది కుమారుని ప్రతిష్ట అంతర్జాతీయ స్థాయికి ఎదగడం పట్ల ప్రిన్సిపల్ కె.బి. జయకుమార్ ఆనందం వ్యక్తం చేశారు.

### ఈదగాలి కండ్రిగలో ఉచిత నేత్ర చికిత్స

నెల్లూరు సిటిజన్స్ క్లబ్ సర్వేపల్లి మండలం ఈదగాలి కండ్రిగలో ఉచిత నేత్ర చికిత్సా శిబిరాన్ని నిర్వహించింది. పాఠశాలల్లో, వీధి చావిడిల్లో జరిగే శిబిరం ఈ గ్రామంలో స్పెషల్‌గా వేమారెడ్డి శ్యామ సుందర రెడ్డి స్వగృహంలో జరిగింది. 150 మంది రోగులను పరీక్షించి వారిలో 35 మందికి శుక్ల పరీక్ష నెల్లూరు బిసి హాస్పిటల్‌లో ఆపరేషన్లు నిర్వహించారు. అక్టోబర్ 2 తేది సాయంత్రం జిల్లా జడ్జి ఎల్. అప్పారావు హాస్పిటల్‌కు విచ్చేసి ఆపరేషన్లు చేయించు కొన్న వారికి కంటి అద్దాలు తన చేతుల మీదుగా ఇచ్చారు. కార్యక్రమంలో కొండా బలరామి రెడ్డి, డాక్టర్ ప్రేమ్‌చంద్, డాక్టర్ లలిత కుమారి పూల, సిటిజన్ క్లబ్ అధ్యక్షుడు బి.వి.ఎన్. బాబు, కార్యదర్శి ఎం. రవీంద్ర బాబు, ఐ క్యాంపు ఛైర్మన్ పి. అంజనేయులు, బి. శ్రీని... తదితరులు పాల్గొన్నారు.

### రైతు బాంధవుని మృతి

ఆత్మకూరులో ప్రముఖ రైతు నాయకుడు, సోమశిల ఉత్తర కాల్వ మిగులు పనికి శక్తి వంచన లేకుండా కృషిచేసిన ఇందూరు దశయ్య ఇటీవల చని పోయారు. పార్టీల కతీతంగా పనిచేసేవారు కాబట్టి ఎమ్మెల్యే లక్ష్మయ్య నాయుడు, మాజీ ఎమ్మెల్యే సుందర రామిరెడ్డి ఆ కుటుంబాన్ని పరామర్శించి వెళ్లారు.

## పంచాంగము

### ముహూర్తములు

19తేది గురువారం ఉదయం11.06 గం. ధనుర్లగ్నమున వివాహ వ్యాపార ప్రారంభములకుసుముహూర్త మున్నది.

### అక్టోబరు తిథులు

ఆశ్వయుజ బహుళ

| | | | |
|---|---|---|---|
| తే 14 | శని షష్ఠి | రా.గ. | 3.38 ప |
| తే 15 | ఆది సప్తమి | రా.గ. | 5.48 ప |
| తే 16 | సోమ అష్టమి పూర్తిగ | | |
| తే 17 | మంగళ అష్టమి | ఉ.గ. | 7.48ప |
| తే 18 | బుధ నవమి | ఉ.గ. | 9.30 ప |
| తే 19 | గురు దశమి | ఉ.గ. | 10.51ప |
| తే 20 | శుక్ర ఏకాదశి | ప.గ. | 11.44ప |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

# హాలులో కంటే ఇంట్లో టివి సినిమాలే మేలు!

ఈ రోజుల్లో ఫలానా తరహా చిత్రమే ఖచ్చితంగా విజయ వంత మవుతుందని ఎవ్వరూ చెప్పలేక పోతున్నారు. పాత రోజుల్లో భిన్నమైన కథాంశం, వైవిధ్యమైన కథనం గల చిత్రాలే తయారయ్యేవి. పాత్రధారులు పోటీ పడి నటించే వారు. ఇప్పటిలా సాంకేతికంగా ముందంజ వేయక పోయినా, విజయ వంతమైన చిత్రాలే అప్పుడు ఎక్కువగా ఉండేవి. ఎన్.టి.ఆర్, ఎ.ఎన్.ఆర్. గార్ల వలె నలభై యాభై ఏళ్ల పాటు ప్రజల మనస్సుల్లో స్థానాన్ని సంపా దించుకోవడం నేటి తరం నటులకు సాధ్యం కాదు. అంకిత భావంతో ఎన్నో ఏళ్లు శ్రమిస్తే గాని, ఆనాటి వారికి ఒక గుర్తింపు, ఇమేజ్ వుండేది కాదు. కాని, ఈనాడు ఏ నటి అయినా, నటుడు అయినా నటించిన ఒక్క చిత్రం విజయ వంతం అయితే చాలు విశేషమైన గుర్తింపు లభిస్తోంది. అయితే అది పది కాలాల పాటు ఉండేది కాదు. ఎంత త్వరగా వెలుగులోకి వస్తున్నారో అంత త్వరగా మరుగున పడి పోతున్నారు. ఈ టివి, జెమిని టివిలో ప్రదర్శింపబడే పాత చిత్రాలు

**పాత చిత్రాలు టివి ప్రేక్షకులను ఆకర్షిస్తున్నాయి**

చూసిన ఈ తరం వారికి ఒక నాటి చిత్రాలే మెరుగు అన్న అభిప్రాయం కల్గుతోంది. పాత చిత్రాలలోని సన్నివేశాలు గాని, మాటలు గాని, పాటలు గాని ఎక్కువ కాలం గుర్తుంటున్నాయి. అంటే, అప్పట్లో చిత్ర నిర్మాణంలో ప్రతి అంశంలోనూ ఎంతో శ్రద్ధ చూపి, చిత్రం బాగా రూపొందించడానికి కృషి చేసేవారు. ఈనాడు వస్తున్న చిత్రాలు దాదాపు అన్నీ థియేటర్ బయటకు వచ్చిన వెంటనే మరచి పోయే విధంగా ఉంటున్నాయి. అందేత ఈ రోజు టివిలో పాత చిత్రాలకు ప్రేక్షకుల నుంచి అనూహ్యమైన ఆదరణ లభిస్తోంది. థియేటర్ కన్నా ఇంట్లో సినిమాయే హాయిగా ఉంటోందని ప్రేక్షక లోకం భావిస్తోంది.

## "వేటగాడు" అక్టోబర్‌లో

"బాజీగర్" హిందీ చిత్రం ఆధారంగా తమ్మారెడ్డి భరద్వాజ నిర్మించిన "వేటగాడు" చిత్రం అక్టోబర్‌లో విడుదల వుతుంది. డాక్టర్ రాజశేఖర్, శ్రీకాంత్, ఆలీ, సౌందర్య, శరత్ బాబు, రంభ, సుజాత, ఉదయ

కొరప 10 పేజీలో

సర్దార్ సుందరం గారబ్బాయి చిత్రంలో టాబుమాలిక్, సత్యనారాయణ

# అన్నమయ్య వెలుగుచూస్తోంది!

అన్నమయ్య కథను గతంలో ఎందరో తెరకెక్కించ దలచి మానుకున్నారు. ఆచార్య ఆత్రేయ రూపొందించిన చక్కని స్క్రిప్టు గతంలో జంధ్యాల దర్శకత్వంలో తెరకెక్క వలసింది. కీర్తనలు కూడా రికార్డ్ చేశారు. ఆ తర్వాత బండి ముందుకు నడవలేదు. ఇప్పుడు కొత్తగా నాగార్జున నాయకుడుగా కె. రాఘవేంద్ర రావు దర్శకత్వంలో వి. దొరస్వామి రాజు ఇదే చిత్రాన్ని జనవరి నుంచి షూటింగ్ కొనసాగించ దలిచారు.

## సుజాత ఆర్ట్ ప్రొడక్షన్స్‌లో ఎ.ఎన్.ఆర్.

మనుమడు అఖిల్ పాల్గొన్న "సిసింద్రీ" అంత బాగా ఆడక పోవడానికి కారణం దానికి మూలమైన ఆంగ్ల చిత్రం మన రాష్ట్రంలో ముందుగా విడుదల వడమేనని అంటున్నారు. స్టార్ మూవీస్ కార్యక్రమాలలో కూడా ఆ ఆంగ్ల చిత్రం ఎలా రూపొందించ బడిందో అద్భుతంగా చూపారు. తాతయ్య అక్కినేని కొత్తగా ఎల్.వి. రామరాజు నిర్మించే చిత్రంలో హీరో. ముప్పలనేని శివ దర్శకుడు.

## "రిక్షావోడు" లో పాట

"నీ పెట్ట నా పుంజాని ముద్దెట్టుకోనీ,
నీ పుంజా నా పెట్టని జోకొట్టి పోనీ"

అనే పాట ఇటీవల చిత్రీకరింప బడింది. ఆ పాట ఆ చిత్ర దర్శకుడు కోడి రామకృష్ణకు ఎంతో నచ్చింది. తన ఇంటి పేరుతో ఆ పాట చక్కగా అమరిందని కాబోలు!

## పోలీస్ ఆఫీసర్ల చిత్రాలు

పోలీస్ ఆఫీసర్ల నిజాయితీని శంకించే వార్తలు అడపా దడపా దిన పత్రికలలో వస్తున్నా - వాళ్ళ నిజాయితీని గొప్పగా చూపించడానికి లోగడ చాలా చిత్రాలు తయారయ్యాయి. కోడి రామకృష్ణ దర్శకత్వం వహించే శ్రీ సాయిరోజా ప్రొడక్షన్స్ చిత్రంలో రోజా, ఎ.పి. చంద్ర దర్శకత్వం నెరపే "నాయకి" చిత్రంలో ఆమని పోలీస్ ఆఫీసరు. మరో రెండు చిత్రాలు కూడా పోలీస్ ఆఫీసర్ల బాధ్యతా నిర్వహణను గొప్పగా చూసేవిగా రానున్నాయి. ఆమేది తీసినా ప్రేక్షకులు చూస్తారనే నమ్మకం నిర్మాతలకు ఉన్నంత కాలం, ఇలాంటి చిత్రాలు వస్తూనే వుంటాయి.

## రాజేంద్రప్రసాద్ సొంత చిత్రం

"రాంబంటు" తర్వాత హీరో రాజేంద్ర ప్రసాద్ నిర్మించే చిత్రానికి పోసాని కృష్ణ కథ రాస్తున్నారు. టి. ప్రభాకర్ దర్శకుడు.

కృష్ణ స్థాయిని, అంతస్తును మహోన్నతంగా పెంచిన...

# తెలుగువీర లేవరా!

**చిత్ర సమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

ప్రముఖ హీరో కృష్ణ తన పద్మాలయా స్టూడియోస్ బ్యానరు పై ఇ.వి.వి. సత్యనారాయణ దర్శకత్వంలో అన్ని రకాల హంగులతో, ఆచరణీయమైన ఆదర్శాలతో "తెలుగు వీరలేవరా!" చిత్రాన్ని నిర్మించాడు. అంతే కాదు ప్రతిభా వంతమైన స్థాయిలో కృష్ణ నటించిన మూడు వందల చిత్రమిది. ఈ చిత్రం కృష్ణకు మరో కీర్తి కిరీటాన్ని బహూకరించింది.

ఇందులో దేశభక్తి, స్వాతంత్ర్య పిపాస, సాంఘిక సంస్కరణ, నిస్వార్థత, ఆత్మ గౌరవం, పౌరుషాగ్ని, విప్లవ చైతన్యం, నిండుగా బలమైన పూపులో నిలబడ్డాయి. ఈ శక్తులన్నీ కలిసి నిజమైన దేశ స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించాయి. ఈ శక్తులన్నిటికి కూడలి ఈ చిత్రంలోని రామరాజు పాత్ర.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని బానిసత్వం పోలేదు. నిరంకుశత్వం పెరిగింది. అన్ని రకాల అత్యాచారాలు, అరాచకాలు, అన్యాయాలు విచ్చల విడిగా విజృం భించాయి. స్వార్థం నగ్నంగా నడివీధిలో [illegible] తెగించి నాట్యం చేస్తూ వుంది. [illegible] వీర విహారం సాగిస్తున్నారు.

ఒకనాడు [illegible] వాళ్ళు వ్యాపారస్తులుగా మన దేశ[illegible] పాదం మోపి ఆ తర్వాత దేశాన్ని కబ[illegible] దేశాభివృద్ధి పేరిట ఇప్పుడు [illegible] ప్రభుత్వమే విదేశీ సంస్థలను [illegible] హ్వానిస్తూ[illegible] వుంది. పరదేశస్తులు వ్యాపార నిమిత్తం మన దేశంలో తిష్ట వేసి వున్న దేశాన్ని కబళించే మరొకసారి అవకాశముందనే సందేహం కలుగుతూ వుంది. అందుల్ల మన దేశాన్ని కాపాడు కునేందుకు, స్వచ్ఛమైన స్వాతంత్ర్యం నెలకొల్పేందుకు "తెలుగు వీర లేవరా" అంటూ కృష్ణ, రామరాజు పాత్రలో ఎలుగెత్తి పిలిచాడు. ఆ పిలుపులో విప్లవ చైతన్యం ప్రకటించాడు. దేశంలోను, దేశం వెలుపల పొంచి వున్న శత్రు కూటమి పై తిరుగుబాటు లేవదీయ మన్నారు. రొమ్ము విరిచి నిలిచి నిజమైన పరాక్రమం నిరూపించ మన్నారు.

పరచూరి బ్రదర్స్ జాతీయ దృక్పథంతో కథను వ్రాశారు. మాటల్లో దేశభక్తిని బాగా రంగ రించారు. కథను ఒక కుటుంబానికి పరిమితం చేశారు. ఒక

కొరప 10 పేజీలో

# సంగీతాభిమానులకు వీనుల విందు!

నెల్లూరు. దర్గామిట్టలో వెలసి వున్న శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి శరన్నవ రాత్రోత్సవాల సందర్భంగా, ట్రస్టు బోర్డు ఛైర్మన్ శ్రీ కోడూరు వెంకట రాఘవ రెడ్డి లలిత కళా కార్యక్రమాలు కన్నుల పండుగగా, వీనుల విందుగా ఏర్పాటు చేశారు.

25 వ తేది శ్రీమతి గీతాకృష్ణ మూర్తి (మద్రాసు) సంగీత కచ్చేరి జరిగింది. ఆమె గాత్ర వైభవం శ్రోతల మనసుల నిండా మధుర భావనను చిలకరించింది.

26 వ తేది హైదరాబాదుకు చెందిన చిరంజీవి నందమూరి తారక రామారావు కూచిపూడి నృత్య ప్రదర్శన రసరమ్యంగా జరిగింది. జన్మాంతర బంధంగా కళాతృష్ణ వెన్ను తడుతుంటే ఆ పసివాడు మామూలుగా ఎలా వుండగలడు? తన సహజ శైలిలో ఎదగాలని ప్రముఖ కూచిపూడి నర్తకి శ్రీమతి శోభా నాయుడు శిష్యుడయ్యాడు. బాల నటరాజుగా పేరుగాంచాడు. నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి ఉప్పొంగిన హృదయంతో ఆ చిరంజీవిని ఘనంగా సన్మానించారు.

27వ తేది కాకినాడ కళాకారిణులు కుమారి అఖిలా రావు, కుమారి అరుణ రేఖల కూచిపూడి నృత్యం, నాట్య పరిమళాలను వెదజల్లింది. కళా విలువలను గుర్తించిన శ్రీ కోడూరు వెంకట రాఘవ రెడ్డి కళాకారిణులను సన్మానించారు.

28 వ తేది తమిళనాడుకు చెందిన కడలూరు వాస్తవ్యులు శ్రీ అయనం పట్టిక గణేశన్ అండ్ పార్టీ "జల తరంగిణి" వినిపించారు. సుసంపన్నమైన సంగీత సంప్రదాయ జల తరంగాలను గాలి తెరలు మధుర తరంగాలుగా మార్చి శ్రోతలను మురిపించి మైమరపించాయి.

28వ తేది శ్రీ వెంపటి చిన సత్యం శిష్యురాలు శ్రీమతి లక్ష్మిమణి (మద్రాసు) అండ్ పార్టీ కూచిపూడి నాట్య ప్రదర్శన, మహోత్సాహంగా ఒక్కోసారి మహోధృతంగా సాగింది. కళా సౌందర్యాన్ని సృజించింది.

30వ తేది మద్రాసుకు చెందిన శ్రీమతి రాధ, శ్రీమతి మీరాల వయొలిన్ వాద్యం రసమయమైన సంగీత స్వర్ణాలను వాయులీనం చేసి వీనుల విందు గొలిపింది.



## చిరు సమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

1వ తేది విజయశ్రీ బుర్ర కథ, జి. పట్నం "భగవద్గీత" బుర్ర కథ, శ్రోతల బుర్రలను ఊపించాయి. శ్రీ కె. రామలింగా రెడ్డి అండ్ పార్టీ హాస్యవల్లరి ఆనందంతో శ్రోతల మనసులను ఊయలలూపింది.

2వ తేది చల్లని సాయంత్రం, అందంగా, ఆనందంగా, ఆహ్లాదంగా ప్రారంభమైన శ్రీ జి. బాలకృష్ణ ప్రసాద్ (తిరుపతి) శాస్త్రీయ సంగీతం మధురాతి మధురంగా సాగి శ్రోతల మనసుల్లో సుస్థిర స్థానం ఏర్పరుచు కున్నది. ఈ సంగీత చక్రవర్తి అన్నమాచార్యుల కృతులను భక్తి పారవశ్యంతో ఆలపించి శ్రీ వెంకటేశ్వర స్వామి దివ్య మంగళ రూపాన్ని కళ్ళకు కట్టారు.

3వ తేది ఉదయ కాంతిలా, ఉల్లాస పవనంలా శ్రీమతి ఎస్.ఎస్. రాజన్ (బెంగుళూరు) శాస్త్రీయ సంగీతం మెల్లమెల్లగా ప్రారంభమై శ్రోతల మనసులను రంజింప జేసింది. ఆ తర్వాత స్ఫటిక తీర్థం వంటి స్వచ్ఛమైన గాత్రంతో ఆమె దేవి పై గానం చేసిన భక్తిమాలలో భక్తితత్వం తొణికిస లాడింది. ఈ సంగీత కచ్చేరీలు, నాట్య ప్రదర్శనలు చూచి తరించేందుకు నెల్లూరు మొత్తం శ్రీ రాజరాజేశ్వరి గుడి ప్రాంగణంలో తిష్ట వేసింది.

అటు భక్తి భావంతోను, ఇటు కళాభిమానంతోను కార్యక్రమాలు వైభవోపేతంగా నిర్వహించ గలిగే భాగ్యం శ్రీ రాఘవరెడ్డికి, శ్రీ రాజరాజేశ్వరి అమ్మ వారి ప్రసాదం. భగవత్కృపతో ఆయన కృషి మరింత విస్తారమగుగాక! భక్త జనులకు ఆదర్శ పాత్రమగుగాక! శ్రీ ప్రయాగ వెంకట రావు తొలి పలుకు మలి పలుకు, కళాకారుల గూర్చి తెలిపిన తీరు పన్నీటి జల్లులా వుండినాయి.

## ధరలు

4 పేజీ తరువాయి

శెనగపప్పు 26 నుండి 28, ఇడ్లీ రవ్వ 16 నుండి 18, ఎండు కొబ్బరి 36 నుండి 40, తెల్ల గడ్డలు 20 నుండి 24, కొబ్బరి నూనె 50 నుండి 60. ఎండు మిర్చి 44 నుండి 50, ఎర్రగడ్డలు 5 నుండి 6 రూపాయలు చేసి అమ్ముతున్నారు. అంతగా డిమాండ్ వుండని ఆవాలు కేజీ 30 రూపాయల ధరపై నిలబడి వుండగా, జీలకర్ర 80 నుండి 85 రూపాయలుగా కాగా, మిరియాలు మాత్రం 120 రూపాయల వద్దే స్థిరంగా వున్నాయి. ప్రభుత్వం ప్రజలకు ఏదో చేస్తున్నట్లుగా చెప్పి ముచ్చటగా మూడు వస్తువుల ధరలూ తగ్గించినా, వ్యాపారస్తులు తెలివిగా అన్ని వస్తువుల ధరలు తమకు అనుకూలంగా పెంచి ప్రజల నోరు కొడుతున్నారు. ఈ విషయంలో జిల్లా ఇన్‌ఛార్జి కలెక్టర్ వుదాసీనంగా వుండక, ఒక రోజు నెల్లూరు మార్కెట్‌లో స్వయంగా తిరిగి విషయాలను పరిశీలిస్తే గాని వ్యాపారస్తులు తమ దారి మార్చుకోరు.

## జిల్లాలో అత్యధికంగా మిగులు భూమి పంపిణీ

జిల్లాలో మిగులు భూమి పంపిణీ, చిన్న తరహా పరిశ్రమలు నెలకొల్పే లక్ష్యాన్ని అధికారులు అధిగమించడం పట్ల ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ సంతోషాన్ని వ్యక్త పరిచారు. 10 తేది కలెక్టరేట్‌లో 20 సూత్రాల అభివృద్ధి పథకం అమలు కార్యక్రమాలను సమీక్షించారు.

## చిత్రసమీక్ష

9 పేజీ తరువాయి

కలెక్టర్ (బాలయ్య) కుటుంబం. అతని పెద్ద కొడుకు (చరణ్ రాజ్) పోలీస్ ఆఫీసర్, రెండవ వాడు సి.బి.ఐ. అధికారి రామరాజు (కృష్ణ), కూతురు (సుధ), డాక్టర్ మేజర్ గడారీగా (రాజనాల) ఒక విదేశీయుడు; మన దేశంలో అడుగు పెట్టాడు. అతనికి మాజీ ముఖ్యమంత్రి (కోట శ్రీనివాస రావు) సహకరిస్తాడు. దేశాన్ని దోచు కోవాలని విదేశీయులు పన్నిన కుట్రను సిబిఐ ఆఫీసర్ (కృష్ణ) బట్ట బయలు చేసి దేశ ద్రోహుల బారి నుండి దేశాన్ని కాపాడు తాడు. క్లుప్తంగా కథ ఇది.

దర్శకుడు ఆద్యంతం చిత్రాన్ని పట్టుగా నడిపించాడు. ప్రతి చిన్న విషయంలోను ప్రత్యేక శ్రద్ధ చూపించి విజయం సాధించాడు. తెలుగు వాడి శౌర్యాన్ని, దేశ భక్తిని ధీటుగా చూపాడు. పాత్రలన్నిటినీ ఒక ప్రయోజనంతో చక్కగా నడిపించాడు. రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యపు గుండెలు అదర గొట్టిన అల్లూరి సీతారామరాజు పాత్రను చిత్రం రెండవ భాగంలో ప్రతిష్టా కరంగా చూపాడు. ప్రతి తెలుగువాడు వీరుడై సీతారామ రాజులా దేశరక్షణకు పోరాడాలన్న ఆదర్శాన్ని చూపాడు.

కృష్ణ ఉద్యమ నేతగా సహజ సిద్ధమైన నటనలో ప్రకాశించాడు. విదేశీ శక్తిగా రాజనాల ఆ పాత్రలో గొప్పగా రాణించాడు. మిగతా అందరు సమర్థవంతంగా నటించారు. ముఖ్యంగా పి.ఎల్. నారాయణ ఒకసారి నెహ్రూగా, మరొకసారి గాంధీ మహాత్ముడుగా జీవించాడు. ఆ మహా నాయకులు ఈనాడు దిగి వచ్చినా వారికి గుర్తింపు, గౌరవం ఈనాటి వాతావరణంలో లభించవని నిరూపించ బడింది ఆ పాత్రల ద్వారా.

జయరాం ఫోటో గ్రఫీ ప్రత్యేకతను సంతరించు కుంది. కోటి సంగీతం అందించిన ఈ చిత్రంలో ఆరు పాటలున్నాయి. అన్నీ మధురంగా వున్నాయి. వేటూరి వ్రాసిన "బ్రహ్మ నాయుడే జన్మనెత్తెనా" బాలు పాడిన టైటిల్ సాంగ్ సాహిత్య ప్రధానంగా వుంది. వేటూరి వ్రాసిన మరో పాట "తెలుగు భాషకు తల కట్టన తల ఎత్తుక తరలిరా" ఉత్తేజంగా సాగింది. పాటలన్నీ చిత్రం ఔన్నత్యానికి దోహదం చేశాయి.

దేశభక్తి ధ్యేయంతో, జాతీయ దృక్పథంతో, విప్లవ చైతన్యంతో, ఆదర్శవంతమైన చిత్రం నిర్మించిన హీరో కృష్ణ నిజంగా తెలుగు వీరుడే.

## సినిమా

9 పేజీ తరువాయి

భాను, చిట్టిబాబు, గౌతంరాజు, అనంత్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, ఐరన్ లెగ్ శాస్త్రి నటించారు. సంగీతం: విద్యాసాగర్, దర్శక నిర్మాత భరద్వాజ ఈ చిత్రంలో పాల్గొన్న నటీనటులకు అత్యధిక పారితోషికం చెల్లించ కుండా తాను ఇవ్వగలిగిన మొత్తానికి అంగీకరించే వారినే బుక్ చేసినట్లు తెలుస్తోంది.

### పరభాషా నటుడు వినోద్‌కుమార్

వినోద్‌కుమార్ కన్నడ నటుడు. మెల్లగా తెలుగు సినిమా రంగంలో ప్రవేశించాడు. తమాషా ఏమిటంటే ఇంత వరకు ఇతను నటించిన చిత్రాల్లో బాగా ఆడిన చిత్రాలలో అత్త పాత్ర ధరించిన వాణిశ్రీకో, హీరోయిన్‌కో, డైరక్టరుకో పేరొచ్చింది కాని, ఇతనికేమి పేరు రాలేదు. అయినా నిర్మాతలు కొందరు ఇతని వెంట పడుతున్నారు. చిత్రంలో దమ్ము లేకున్నా తమ బ్యానర్ వాల్యూతో, వినోద కుమార్ హీరోగా నటిస్తే కనక రాశులు రాల్తాయని కొందరు నిర్మాతల నమ్మిక. ఒకే మూసలో పోసినట్లు తయారయ్యే చిత్రాలతో జనం చాలా విసిగి పోయారని వరుసగా కొన్ని చిత్రాలు ఫెయిల్ అయితే గాని నిర్మాతలకు బోధపడదు. ఒక పద్ధతి లేకుండా సాగుతున్న తెలుగు సినీ పరిశ్రమ ప్రస్తుతం ఏ స్థితిలో ఉందో బేరీజు వేసుకోవలసిన సమయం ఆసన్నమైంది. మరో వంక సామాన్య ప్రేక్షకుడు అధిక ధనం వెచ్చించి థియేటర్లకు వెళ్ళడం కన్నా ఇంట్లో కూర్చునే హాయిగా టి.వి.లో సినిమాలు చూసెయ్య గలడు. ఈ టి.వి. ఛానల్సును సినిమా పరిశ్రమ ఎలా ఎదుర్కొంటుందో!

### నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

"మైనా", ప్రియా ఆర్ట్ ప్రొడక్షన్స్ "మృగం", గౌతమ్ ప్రొడక్షన్స్ "వైరం", రామాలయం ఫిలిమ్స్ "అరెస్ట్", ప్రభు ఫిలిమ్స్ "తుగ్లక్", పాంచజన్య క్రియేషన్స్ "నాయకి", శ్రీ అఖిలాండేశ్వరి ఫిలిమ్స్ "రౌడీ నాయకుడు", గాయత్రి సినీ క్రియేషన్స్ "సెంట్రల్ రౌడీ", ఎస్.ఎస్. ఆర్ట్ మూవీస్ "రహస్య పోలీస్", శ్రీ ధర్మసాయి క్రియేషన్స్ "రౌడీ అన్నలు", రాఘవేంద్ర సినీ చిత్ర "రౌడీ కమీషనర్", శ్రీ షిర్డిబాబా ఫిలిమ్స్ "అమ్మ నాన్న ఆశీర్వాదం", అర్చన కిరణ్ మూవీస్ "ఆడాళ్ళు బాబోయ్ ఆడాళ్ళు", శ్రీ దేవత ఫిలిమ్స్ "భూలోక రంభ", స్మిక్ ఫిలిమ్స్ "బొబ్బిలి బుల్లోడు", గౌతమి పిక్చర్స్ "చైన్ బ్యాచ్", ఓం మూవీ మేకర్స్ "గోల్డ్ మాన్", శ్రీ వీరభోగ వసంత రాయ ఫిలిమ్స్ "కాలేజి కుర్రోళ్ళు", దివ్య గురుదేవ్ క్రియేషన్స్ "మరో మయూరి", ఎం.ఎల్. మూవీ ఆర్ట్ "మంగళ సూత్రం", గీతాంజలి ఫిలిమ్ ప్రొడక్షన్స్ "నాతి చరామి", శ్రీ అమూల్య ఆర్ట్ ప్రొడక్షన్స్ "ఓసి నా కోడలా", శ్రీ రాఘవేంద్ర మూవీ కార్పొరేషన్ "పెళ్ళి సందడి", నేషనల్ ఆర్ట్ మూవీస్ "పెళ్ళాల రాజ్యం", వసంత రాయ ఫిలిమ్స్ "ప్రేమాంజలి", శ్రీ బాలా సినీ ఎంటర్ ప్రైజస్ "పంజరం", చక్రిజ క్రియేషన్స్ "రుద్ర భూపతి", పాంచజన్య క్రియేషన్స్ "శుభవేళ", శ్రీ షిర్డిబాబా ఫిలిమ్స్ "శ్రీమతి ముచ్చట్లు - శ్రీవారి అగచాట్లు", శాతవాహన మూవీస్ "సహగమనం", జ్ఞానయోగి క్రియేషన్స్ "విశ్వ రహస్యం", మమతా ఎంటర్ ప్రైజస్ "వ్యామోహం", ఆర్.కె. ఇంటర్నేషనల్ "ఛాలెంజర్", విజయ తేజ కంబైన్స్ "కాలజ్ఞానం 2000" పవర్ మూవీస్ "ప్రియమైన శత్రువు".



## నెల్లూరు సంగతులు

4పేజీ కొరవ

లేని విధంగా ఏర్పడిన విద్యుత్ కోతను వర్షాలు పడే సమయానికి కూడా కొత్త ముఖ్యమంత్రి సరిచేయలేదు. కేంద్ర ప్రభుత్వం అడిగిందే తడువుగా యూరియాను ఇచ్చేందుకు అంగీకరించినా దానిని తెచ్చుకొని రైతులకు అందించే పరిస్థితి ప్రభుత్వానికి లేక పోయిందన్నారు. యూరియా కొరత వల్ల ఈ ఏడాది పంట దిగుబడి తగ్గే ప్రమాదం వుందని జనార్థన రెడ్డి ఆందోళన వ్యక్త పరిచారు. సమావేశంలో డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి, మాజీ శాసన సభ్యుడు సివి శేషారెడ్డి కూడా పాల్గొన్నారు.

### జిల్లాలో యూరియా కొరత లేదు : కలెక్టర్

జిల్లాలో యూరియా కొరత లేదని, రైతులు ఆందోళన పడ వద్దని ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ ధైర్యం చెప్పారు. 8 తేది కలెక్టరేట్‌లోని సైక్లోన్ మీటింగు హాల్‌లో జిల్లాలోని వ్యవసాయాధి కారులు, ఎరువుల తయారీ దారులు, వ్యాపారస్తులను పిలిచి ఒక ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడా రాయన అక్టోబర్ మాసానికి జిల్లాకు 5 వేల టన్నుల యూరియా అవసరం వుండగా, అంతే మొత్తం ప్రస్తుతం నిల్వ వుందన్నారు. ఈ యూరియాను ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల ద్వారా రైతులకు సరఫరా చేస్తామన్నారు. అక్రమార్జన కోసం కొందరు వ్యాపారస్తులు కృత్రిమ కొరతను సృష్టించడం తన దృష్టికి వచ్చిందని, అటువంటి వారి పై దయా దాక్షిణ్యాలు లేకుండా చర్యలు తీసు కొంటా మన్నారాయన. కావలి డివిజన్‌లో వున్న ఎరువుల కొరతను వ్యవసాయ శాఖాధి కారులే స్వయంగా సరిదిద్దు తారన్నారు. నవంబరులో జిల్లాలో ఎరువుల వినియోగం అధికంగా వుంటుందని, అందువల్ల సంబంధిత తయారీ కేంద్రాల నుండి దిగుమతికి వ్యవసాయాధి కారులు తగిన శ్రద్ధ చూపాలని సలహా యిచ్చారు. వ్యవసాయ శాఖ సంయుక్త సంచాలకుల అనుమతి పొందకుండా టోకు, వ్యాపారస్తులు, రిటైల్ వ్యాపారస్తులు ఎరువులు అమ్మినా, తమ వద్ద వుండే నిల్వను అధికారులకు వెంటనే తెలియ జేయాలన్నారు. సమావేశంలో వ్యవసాయ శాఖ జాయింట్ కలెక్టర్ శ్రీ ఎం. కృష్ణమూర్తి కూడా పాల్గొన్నారు.

### బాలల సంక్షేమానికి 50 లక్షలు

టౌన్‌లోని ఆటో మొబైల్ షాపులు, హోటళ్లలో పనిచేసే బాల కార్మికులను చూసి చాలా మంది అయ్యో అంటుంటారు. ఇటువంటి బాల కార్మికులు జిల్లా వ్యాప్తంగా 2,500 పైగా వున్నట్లు ప్రభుత్వం ఒక సర్వే ద్వారా తెలుసుకో గల్గింది. వీరి సంక్షేమానికి ఆలస్యంగా నైనా ఒక బృహత్తర పథకాన్ని చేపట్ట నుంది. బీడి, చుట్టల తయారీ, ఆటో మొబైల్, మైకా గనుల్లో పనిచేస్తున్న 14 సంవత్సరాల లోపు బాల బాలికల చేత ప్రభుత్వం ఆ వృత్తులను మాన్పింప జేస్తుంది. వీరందరికీ విద్య నభ్యసించ డానికి తగిన వసతులతో 20 ప్రత్యేక పాఠశాలలు ప్రారంభించ నున్నట్లు ఇన్‌ఛార్జి కలెక్టర్ ఎ. గిరిధర్ చెప్పారు. దీనికోసం ప్రభుత్వం 95-96 సంవత్సరానికి 50 - 60 లక్షల రూపాయలు కేటాయించిందట. అందులో మొదటి విడతగా 7.07 లక్షలు ప్రస్తుతం మంజూరైనట్లు, 2001 సంవత్సరానికి జిల్లాలోని బాల కార్మికు లందరికీ విద్యా బోధన చేసి, వృత్తి విద్యా కోర్సులలో కూడా తర్ఫీదు చేయించడం ప్రాజెక్ట ముఖ్య వుద్దేశ్య మంటున్నారు కలెక్టర్ గారు. ఈ పనులన్నీ చేయడానికి కలెక్టర్ అధ్యక్షతన జిల్లా బాల కార్మికుల సొసైటీని 5 తేది ఏర్పాటు చేసారు. దీనిలో 18 మంది సభ్యు లుంటారు. జాయింట్ కలెక్టర్, ఎస్‌పి కమిటీకి వైస్ ఛైర్మన్లు, డి.ఆర్.డి.ఎ. ప్రాజెక్ట డైరక్టర్ కో ఆర్డినేటర్, బాలకార్మిక ప్రాజెక్ట డైరక్టర్ సెక్రటరీ, కమిటీ సభ్యులు.

### సహకార సంఘాధ్యక్షుల శిక్షణా తరగతులు

రాష్ట్ర సహకార బ్యాంకు జిల్లాల వారీగా కొత్తగా ఎన్నికైన సహకార సంఘా ధ్యక్షులకు శిక్షణా తరగతులు నిర్వహించ తలపెట్టింది. ఈ తరగతుల్లో సహకార వ్యవస్థ తీరుతెన్నులు, అప్పులు, వసూలు చేసే పద్ధతి పై నిష్ణాతులతో వుపన్యాసాలు ఏర్పాటు చేసారు. జిల్లాలోని 198 సహకార సంఘాల అధ్యక్షులకు దశల వారీగా 9, 10, 11, 12, 13, 14 తేదిల్లో శిక్షణను జిల్లా కేంద్ర సహకార బ్యాంకు మీటింగు హాలులో ఇస్తున్నారు. జిల్లా సహకార బ్యాంకు అధ్యక్షుడు వేనాటి మునిరెడ్డి 9 తేది సహకార పతాకాన్ని ఆవిష్కరించి కార్యక్రమాన్ని ప్రారంభించి మాట్లాడారు. శిక్షణా తరగతులు సహకార రంగంలోని లోతు పాతులు తెలుసు కోను ఎంతగానో వుపయోగ పడతాయి. రాష్ట్ర సహకార బ్యాంకు కొత్త ముఖ్య మంత్రి సలహాతో ఇటువంటి కార్యక్రమం మొదలు పెట్టడం ముదావహ మన్నారాయన. బ్యాంకు అధికారి శ్రీ. వేణు గోపాల్ రెడ్డి, సహ శాఖాధికారి రవి ప్రకాష్, గూడూరు, నెల్లూరు, కావలి డివిజనల్ సహకార శాఖాధికార్లు పలువురు సహకార సంఘాధ్యక్షులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

### బిసి నిరుద్యోగులకు సదవకాశం

జిల్లాలోని వెనక బడిన తరగతులకు చెందిన నిరుద్యోగులకు కంప్యూటర్ డేటా ఎంట్రీ, స్టెనో గ్రఫీ కోర్సులలో ప్రవేశానికి దరఖాస్తులు కోరుతున్నారు. ఇంటర్మీడియట్ పాసై 18 సంవత్సరాల నుండి 34 సంవత్సరాల మధ్య వయస్సున్న ఏడాదికి; 12 వేల రూపాయల కుటుంబ ఆదాయం మించని వారు దీనికి అర్హులు. శిక్షణ ఇచ్చే తొమ్మిది నెలల కాలంలో 250 రూపాయల ఉపకార వేతనం కూడా ఇస్తారట. దరఖాస్తులను వెనుకబడిన సంక్షేమాధికారి, బిసి వెల్ఫేర్ ఆఫీసు, ట్రంకురోడ్డు, నెల్లూరు -1. చిరునామాకు అక్టోబర్ 15 తేది లోగా దరఖాస్తులు పంపమని కోరుతున్నారు.

### హోమియోపతి అసోసియేషన్

గుంటూరు జోన్ ఇండియన్ మెడిసిన్, హోమియోపతి ఎంప్లాయిస్ అసోసి యేషన్ సర్వసభ్య సమావేశం 8తేది నెల్లూరులో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన నూతన కార్యవర్గ ఎన్నికల్లో అధ్యక్షునిగా బి. చెంచయ్య, ఉపాధ్యక్షులుగా ఎం.వి. రవీంద్ర కుమార్, ఎ. మణి భూషణాచారి, కార్యదర్శిగా డి. దేవానంద్, ఆర్గనైజింగ్ కార్యదర్శిగా వి.బి.వి. శాస్త్రి, కోశాధికారిగా ఎం. శివశంకర్ ఎన్నికయ్యారు. డివిజన్ కార్యదర్శులుగా టి. అన్నమ్మ, ఎం. రాఘవ రెడ్డి, సంయుక్త కార్యదర్శులుగా ఎ. శ్యామల, ఎం. సాంబశివయ్య, ఎస్. సుబ్బారెడ్డిలను నియమించారు. వీరు గాక మరో 8మంది కార్యవర్గ సభ్యులను కూడా ఎన్నుకున్నారు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. విజయ రావు, కోశాధికారిగా సి.హెచ్. బాలకృష్ణ విచ్చేసి ఎన్నికలను పర్యవేక్షించారు.

## కోర్కెలు

2పేజీ కొరవ

కాకపోతానా? అని ఎన్టీఆర్ గంపెడాశతో వున్నారు. అలాగే బంధుత్వాన్ని పక్కకు పెట్టి రాజకీయంగా ఎన్టీఆర్‌ను, దగ్గుబాటిని కాలరాయాలని చంద్రబాబు ఎత్తుకు పై ఎత్తులు వేస్తున్నారు. అవసరమైతే కాంగ్రెస్ పార్టీ సహాయం కూడా తీసుకోవాలన్నది ఆయన మనసులోని మాట. ఇందుకు ఉభయ కమ్యూనిస్టులు అంగీకరించకపోతే లోపాయకారిగా కాంగ్రెస్‌తో ఒక అవగాహన కుదుర్చు కోవచ్చు.

### ప్రభుత్వం వుందా? లేదా?

నెల రోజుల్లోనే చంద్రబాబు ప్రభుత్వం పస తేలిపోయింది. ముఖ్యమంత్రి అయ్యాక రాజకీయంగా ఇల్లు చక్క దిద్దు కోవటంతోనే బాబు పని అయిపోతున్నది. ప్రభుత్వ పరంగా సరికొత్త విధాన నిర్ణయం అంటూ ఏది చేయలేక పోతున్నాడు. పాత ప్రభుత్వాల్లో ప్రవేశ పెట్టిన పథకాలనే వల్లె వేస్తూ రోజుకో సమీక్షా సమావేశం ఏర్పాటు చేసి కాలక్షేపం చేయడం మినహా కొత్త ప్రభుత్వం ఏర్పాటైందన్న ఇంపాక్ట్ తేలేక పోతున్నాడు. ఎన్టీఆర్ మంత్రి వర్గంలో నెంబర్ టూగా రాణించిన బాబు నెంబర్ వన్‌గా తన ప్రభావాన్ని చూపించలేక పోవడానికి కారణం దిన దిన గండంగా మారిన ఎమ్మెల్యేల వలస వల్ల ఏర్పడుతున్న రాజకీయ అస్థిరత నవచ్చు.

### పెన్న రోడ్డు బ్రిడ్జి ఆవేదన

నన్ను పెన్న బ్రిడ్జి అంటారు
ఒకే జిల్లాలో వున్న ఉత్తరదక్షిణ
ప్రాంతీయులకు మైత్రీభావం
పెంచమని నన్ను సృష్టించారు పెద్దలు

నా చిన్నతనం బహుముచ్చటగా వుండేది
నా సొగను చూసి ఇతరులే కాదు
నేనూ మురిసిపోయ్యేదాన్ని
నా జీవితం పూలబాటే అనుకున్నా

అయిదెల్లదాటాకబల్లోపారాలు నేర్చుకోవడం
నాకూ తప్పలేదు
బ్రతుకు దుర్భరంమయింది క్రమంగ
నన్ను పట్టించుకొనే నాధుడే
కరువయ్యాడు
నాల్గు దశాబ్దాలకే ఎనభైయేళ్లవాణ్ణయ్య

రోజు రోజుకూ నా పైన
భారం పెరుగుతూనే వుంది
ఈ భారాన్ని ఎంత కాలం మోయగలనో
ఆ రంగనాథుడికే ఎరుక
నా వంటి నిండాగాయాలూ, రుగ్మతలే,
నాకు నిరోధక టీకాలు వేయరు కదా
ప్రాథమికచికిత్సచేసే వాడు కూడా లేడు
గతుకులు అతుకులు ఒళ్లు దడదడ
యిదే నా నిర్భర నిత్యజీవితం
డాక్టర్ల కొరతుందేమో
కనీసం ఓనర్సన్నా, స్వీపరన్నా,
అప్పుడప్పుడన్నా
నామీద దుమ్ము ధూళి దులపొచ్చుగ
వరుణుడు కరుణిస్తేనే నాకు చక్రస్నానం
అహంకార నిర్లక్ష్యాలకు ప్రతిఫలంగ
అప్పుడప్పుడూ గంటలకొద్దీ నా పై
జన చలనం కుంటుబడుతుంది
ఆరోజు నా పేరు పేపర్లో పడుతుంది
దాన్ని చూచి నవ్వాలో ఏడ్వాలో
తెలియదు

నిర్విరామంగ మీకు సేవ చేసే నా
ఆరోగ్యాన్ని కాపాడండి
మలినం నుంచి నన్ను దూరం చేయండి
నా గాయాలకు సరైన ఆయింటిమెంటు
పూయండి
నాకు గుండెదడ లేకుండ చూడండి
కరెంటుతో నాకూ అంత తేజస్సు
నివ్వండి

చివరిగ ఓ హెచ్చరిక
ముందే చెప్పేనుగ
యే రోజు యే ముప్పు కలిగిస్తుందో నన్ను
నా కోలమైన వారసుణ్ణి చూడండి
చేతులు కాలిదాకా ఆగకుండా

ఎమ్.సుబ్బారావు

### శృంగవరపుకోట డి.ము. కోర్టులో

O.S. 72/91 : I.A. 72/93

Between:

State Bank of India,
శృంగవరపుకోట -వాది

and

M.M.K.A. అప్పారావు వగైరాప్రతివాదు
To, D3 సిరిసపల్లి అప్పలనాయుడు
S/o. తమ్మునాయుడు - 45 సం.లు
వ్యవసాయం, లక్కవరపుకోట
లక్కవరపుకోట మండలం

పై దావాలో ఫైనల్ డిక్రీ పాస్ చేయించమని కోరుచూ వాది పై ఫైనల్ డిక్రీ పిటీషను దాఖలు చేసి యున్నందున అందుకు నీకు ఆక్షేపణలు ఉన్న యెడల పై కోర్టులో 20.10.95 తేది ఉదయం 10 గంటలకు ఖుద్దున పాని సరియైన బోగట్టా ఇవ్వబడిన న్యాయవాది ద్వారా గాని తెలియ పరచుకొన వలెను. లేని యెడల పై ఫైనల్ డిక్రీని పరోక్షమందు తీర్మానింప బడును.

శృంగవరపుకోట 4.10.95తేది — ఎమ్.కామేశ్వరరావు, అడ్వకేటు

### నెల్లూరు 1st అ.డి.ము. కోర్టులో

E.P. 79/90 : O.S. 580/85

Syndicate Bank,
Dargamitta, Nellore represented by its Manager -DHr

ఎల్. సుబ్రహ్మణ్యం -JDr

యీ క్రింది షెడ్యూలు దాఖలా ప్రతివాది తాలూకు చరాస్థిని 16.10.95 తేదిన పగలు 10 గంటలకు పై కోర్టు వారి ఎదుట యాలం జరుపబడును.

#### షెడ్యూలు

నెల్లూరు టవును ప్రకాశం పంతులు షాపింగ్ కాంప్లెక్సు రూము నెం. 10రులో వుండు చరాస్థి వివరం

| | DHr Value | Amin Value |
|---|---|---|
| 1. G.E.C. ఫ్రిడ్జి కండిషనులో లేనిది | 6000/- | 4000/- |
| 2. యినుప రేకులతో తయారు చేసిన గాడ్రెజ్ బీరువా 2 అరలు కలది | 400/- | 300/- |
| 3. షోకేసు 2 అరలు కలది షుమారు 4 అడుగుల ఎత్తు | 250/- | 200/- |
| 4. ప్లాస్టిక్ వైరుతో అల్లిన గాడ్రెజ్ కుర్చీ | 100/- | 75/- |
| 5. అద్దాలతో దిగించిన ర్యాక్ షుమారు 10 అడుగుల ఎత్తు | 2500/- | 2000/ |
| 6. కేడియా సీలింగు ఫాను | 800/- | 400/- |
| 7. మైసూరు ట్యూబ్ లైటు | 100/- | 100/- |
| 8. చక్కతో చేయబడిన ర్యాక్ 6 అడుగుల ఎత్తు కలది | 500/- | 300/- |
| 9. చిన్న కూలింగ్ బాక్సు | 2000/- | 100/- |
| 10. చక్కతో తయారు చేసిన చిన్న స్టూలు | 500/- | 400/- |
| 11. చిన్న ర్యాకు అద్దాలది | 300/- | 200/- |

ఎమ్. రవీంద్రరెడ్డి
Advocate for DHr

## 50 ఏళ్ళ క్రితం

3 [illegible]

విజయోత్సవాలని ఒక మూల చందాలు. యుద్ధ బాండ్లు, సేవింగ్స్ సర్టిఫికెట్లుకని ఒక మూల దండ యాత్రలట్లుండగా పైపెచ్చు యిలాంటి పైవేటు వసూళ్లు గూడా ప్రజల నెత్తిన రుద్దవలసిందేనా? విశ్వ బ్రాహ్మణ పేద విద్యా నిధి క్రింద సూళ్లూరు పేట, నాయుడు పేటలలో ఎక్సయిజ్ ఆఫీసరు వసూలు చేసిన 2 వేలు రూపాయలు మాత్రం మేము ఆమోదిస్తాము. ఎందు వల్లనంటే యీ జిల్లాలో పేద పిల్లల విద్యా నిధికి వుపయోగ పడేది కాబట్టి అంత ఆక్షేపణకర మయింది కాదు.

15 వేల రూపాయల వసూలు విషయం మాత్రం కలెక్టరు గారు గట్టిగా విచారించి గవర్నమెంటుకు వ్రాసి వారికి రీఫండు యిప్పించ వలెను.

### శాకుంతలము

దుష్యంతుడు కె.ఎస్. రావు గారి వేషము బేషన్గానే వుంది. అతని పద్య పఠన పోకడ ఆ పాత కాలాన్ని స్మృతి పథానికి తెచ్చి ఆనందాన్ని గూర్చింది.

ను. కుమారి శకుంతలకు శరీర పుష్టి గాని భావరస పుష్టి చొత్తుగా కనిపించలేదు.

ఈమాటు యీ శకుంతల నాటకాన్ని ప్రదర్శించా లంటే ప్రతి ఒక్కరూ రసజ్ఞులగు గురువు వద్ద క్షుణ్ణంగా పాఠం చెప్పించుకొని, అర్ధమ పక్షం 10 సార్లయినా ఒద్దికలు జరిపి ప్రదర్శించమని గోరుతాను.

### అవి - ఇవి

వి.ఆర్. కాలేజి ఇంటర్ చదివే విద్యార్థి సి.వి. సుబ్బరాజనే కుర్రాడు 9 తేది వుదయం తలమంచి వద్ద రైలు క్రింద పడ్డాడు. హాస్పిటల్కు చేర్చగా చనిపోయాడు. అతని జేబులో వున్న జాబును బట్టి ఆత్మహత్య చేసుకున్నట్లు తెలుస్తున్నది. అతనుండిన వీధి గూడా ఆ మాటే అంటున్నారు. తక్కిన కారణాలు మనకెందుకు లెండి!

* * *

స్టోన్హౌస్పేట యోదాల వెంకట చలం శెట్టి గారి కొడుకు వెంకట సుబ్బయ్య శెట్టి యింటిని 8 తేది స్పెషల్ డి.సి.టి.ఒ. సుబ్బ రామానాయుడు గారు సోదా చేయగా ఓవల్టిన్ డబ్బాలు 6, హార్లిక్స్ డబ్బాలు 2 దొరికెను. ఓవల్టిన్ను ఒకటి ఎనిమిది రూపాయల కమ్మినట్లు ఆయన లెక్కలు గూడా సాక్ష్యమిస్తున్నవి.

* * *

గాంధీ జయంతి సందర్భముగా పొట్టి శ్రీరాములు గారు భిక్షాటనంలో సంపాదించిన బియ్యంలో 7 వ హరిజనులతో సహ పంక్తి విందు జరిగింది. అనాథ శిశు శరణాలయంలో అక్కడే హిందూ సంస్కరణ సమితి సర్వసభ్య సమావేశము జరిగింది. చంద్రమౌళి . సిద్ధాన్తి గారు సంఘోద్ధేశముల గూర్చి ఉపన్యసించారు.

సాయిబాబా పూజోత్సవాలు డాక్టరు రాజగోపాలా చారి గారు జరుపు తున్నారు. విజయ దశమి నాడు (16 తేది) దరిద్ర నారాయణులకు వస్త్రాన్న ప్రదానము జరుగును.

* * *

### వర్షమెప్పుడు

**అక్టోబరు 17 నుండి నవంబరు 7వరకు కురియును**

వర్షము 17.10.45 నుండి 7.11.45 లోపల కురియును. చిత్రకార్తె 4వ పాదంలో ఆరంభించి స్వాతిలో చెర్వులు నిండే వర్షము కురియును